శ్రీరస్తు.

# సర్వమధురము

(అచ్చ తెలుఁగు కబ్బము.)

గ్రంథకర్త

మహాకవి ములుగు, పాపయారాధ్యులు.

సంశోధకులు

తాఁడేపల్లి, వెంకటప్పయ్యా శాస్త్రి గారు.

ప్రకాశకుఁడు

ములుగు, వీరభద్ర శాస్త్రి.

జగ్గయ్యపేట.



శైవప్రచారిణీ ముద్రాక్షరశాల

వరంగల్. (నైజాం)

 వెల. రు ౧-౦-౦

శా॥౧౮౪౬ వైశాఖ శు ౨ లు.

# ఉపోద్ఘాతము.

సర్వజ్ఞులగు పండితవర్యులారా !

ఈసర్వమధుర మనునచ్చ తెలుఁగు పొత్తము రచించిన యుత్తమ కవి ములుఁగు "పాప యారాధ్యుండను" శ్రీగురు పట్టభద్రవేమ నారాధ్యవంశ మౌక్తికము. ఈ యనకే సంగమేశ్వరశాస్త్రి యనియుఁ బ్రథమ నామధేయము. ఈ పండితకవి అక్కమాంబా సంగమేశ్వరారాధ్యులకుఁ బౌత్రుఁడు, భ్రమరాంబా వీరనారాధ్యులకుం బుత్రుఁడు, సంస్కృతాంధ్ర భాషల యందు సమాన సాహితీ కలన గలవాఁడు. మఱియు నుభయవ్యాకరణ శాస్త్రవేత్త, రెండుబాసల కైతయందును గండుమీఱినవాఁడు. "కల్యాణచంపు" మున్నగు గీర్వాణభాషాప్రబంధములును, "సరసహృదయానురంజనము మొదలగు మిశ్రకావ్యములును' సర్వమధురము "మున్నగాఁ గొన్ని యచ్చ తెలుంగు పొత్తములును రచించెను మొత్తముమీఁద శతసంఖ్యకు మీఱిన గ్రంథములీ మహాకవిచే రచియింపఁ బడినవి. అని తెలియ వచ్చు చున్నది. మఱియు "శ్రీదేవీ భాగవతము"అనుమహాపురాణము నీయనఘుం డాంధ్రీకరించెను. సహృదయుల హృదయముల కిక్కువి శేఖరునిచే రచింపఁ బడిన"కల్యాణచంపూ" ప్రబంధములోని కల్పనలు సంస్కృతకవిత్వ వైశారద్యమునకును, "సర్వ మధురమున"రచనామాధురి యాంధ్రకవితా సామ్రాజ్యమునకును నిదర్శనకములు గాకపోవు ఇమ్మహాకవి యాశుకవితయందలి ధారణాధోరణు లసాధారణములనినందుల కీయన యనల్ప కల్పనాశైలియే సాక్ష్యమిచ్చు చున్నయది ఈపద్వెక్కువి రేఫద్వయమునకు "రమో"స్తనునేకశేషమును బట్టి పోతనామాత్యాదుల వలెనె యతి ప్రాసల యందు భేదమును బాటింపని వాఁడే" ఈతనిమృదు మధుర పదశైలిని, ధారాశుద్ధినిఁ బోల్చి చూపుటకుఁ బ్రాచీనకవులలోఁ దక్క నవీనకవులలో నెవ్వారి శైలియేనియుఁ గనుపట్టుననుట సంశయాస్పదమే. కందుకూరి వీరేశలింగము పంతులు గారు స్వసంపాదిత కవిజీవితములలో నన్ని కవితా విమర్శనముతోఁ బాటుగ నిమ్మహాకవి కవిత్వ మును విమర్శించుచుఁ దము కులభించిన యొక్క"యహల్యాసంక్రందనీయము"అను సతిత్ప్రణీత ముగుగ్రంథమున నొకపద్యమును లేఖకప్రస్తశేషము నుదాహరించి యిక్కవి కవితకు వ్యాకరణమైలుఁగనిదోసము గల దని వ్రాసె నఁట. దానికిఁ గవిభావరసజ్ఞు లగు విద్వాంసులే సమాధానము సూహింతురుగాత "పరమపతివ్రతైనమునిభామిని తో నెక సక్కెమేమి" యనిశ్రీ పంతులు వారికిం జిక్కెనఁట మాకు లభించిన ప్రాఁతపుస్తకములో నాపద్యమే

చ. సరిసరి నీవు వంటి నెఱ, జాణలు పుట్టిరె వార లెల్ల ని
కరణి వచించిరే చిఱుత,కార్యము లిచ్చటఁ జెల్లునే యహో
పరమపవిత్ర లైనమునిభామలతో నెకసక్కె మేమి ; నీ
గరిమను గానవచ్చె నది, గా దనరో వినరో బుధాగ్రణుల్,

బంగారుజరివల్వ పొంగారుదువ్వల్వ
గట్టుగా బిగియించు దట్టిగాఁగ
వెల్లమోరపులుంగు తెల్లవార్చువెలుంగు
జక్కఁగాఁగొలువుండు చక్కఁగాఁగ

గీ. చేరసంద్రంబు వెలిదమ్మిఁజేరుతపసి
తలపులోనగూర్చ దెసతెల్ల వలపుఁగూర్ప
వెలయునేవేల్పుదొసఁగుల వేరువిత్తు
దలఁతుడెందమ్ము నెత్తమ్మిఁ దమ్మికంటి.

ఉ. తల్లులుకంటగాని పజఁ దప్పుటకెవ్వరు పాలు వంటకం
బొల్లెలు సొమ్ము లిండ్లు ముదు లుగ్గులు తెల్లవితానయాటయే
తెల్లముగానఁ దల్లియని తెల్పఁగనాననియంచునెంచి నేఁ
దల్లికిఁదల్లియైన మరు తల్లిఁ దలంచెదనుల్లమందుఁగన్

మ. నుదుటన్ వ్రాసినవ్రాఁతకన్నఁగలదే నాత్రెండ్లలో నెంచఁడం
బదిగానెంచిన నిందుకింకనొరుఁడై మ్రొక్కల్గునే యొల్లరున్
మదిఁగొల్వంగ శతండుసూ దెసయెటుల్ మ్రొన్నీశపమిం జెట్టయా
గద కొల్వందగువేల్పునల్వయని యక్కర్జంబె నేనెంచితిన్.

సీ. నడనీటురాణెంపు నకు వేతపొగడేల
నంచలందడియాడు టదియయేటుక
మముబోఁటిబిడ్డల మన్నించుటననేల
తలవాకిటననిల్చి మెలఁగుటేటుఁక
మొదటిచొక్కఁపు గొన మ్మ్మలిత [illegible] నేల
వెలివెలుంగులమేని తెలుకుటేటుక
కరఁగినీరగుడెంద మిరవువేల్పననేల
నిశ్చపిణియసొక్కు నెఱపుటేటుక

గీ. ఎందతెందలఁగనిన నం దుదుమేలుఁ
జెందఁగలదేమి తెల్పఁగ లయకట్టి
యమ్మనెమ్మదినమ్ముట సొమ్ముసుమ్ము
టంచుఁబల్కులపొడకా సించువాఁడ

మ. సతసంద్రంబులఁ బిల్చి మీఁదికి వెలార్పన్ నిక్కఁ జేముక్కుఁ జో
పితి వజ్జల్లెగడా కొయుల్ గురియుటల్ పెక్కేండ్లుగా దేవాగన్
సతమే వాషయుటంచుమించ జగమెంచం బెంచునీలావుగా
వృతమమ్మున్ వెనకయ్యనీనెనరుత ప్పాల్ పాచి కాపాడదే. 7

చ. పెనఁకువ దిండిపై నెనరు పెంపదియెట్టిదొ కూడు గూరలున్
నిని చెదుపొట్టయుబ్బ నన నిచ్చలు రక్కసిమూక, నెల్ల ద
క్కినయెకిమీని యిల్లడుగుఁ గ్రిక్కిరియించితియాపిపైనఁ బె
ల్చననిడలేద యోహానుమ చాలునువూపగలన్ గుదింపఁగన్. 8

సీ. ఇల్లాలినుదుటితో నెనయాటనేకదా
        క్షలువతేసికపూవుఁ గట్టినాఁడు
పోయాలిలేఁగొను, బోలుటనేకదా
        వినుపెద్దతలగాఁగ నునుచినాఁడు
జవరాలిచూడ్కితో సరియాటనేకదా
        బళిజింకపిల్లఁజేఁ బట్టినాఁడు
మంచాలికీల్జడ చూడ్కి యాటనేకదా
        చిలువపెంజేరమ్ముఁ జేర్చినాఁడు

గీ. ఇంతసింగారమునవిచ్చ నెలయువేల్పు
    కలఁడవేఱొక్కఁడనినాదు కబ్బమునకు
    నెల్లసింగారమొనగూర్ప నుల్లమునను
    వేడుకొనియెదజన్నంపు వేటకాని. 9

గీ. పుట్టపైఁబెట్టువానినిఁ బుట్టలోనఁ
    బుట్టువానినిఁ బుట్టియుఁ బుట్టనట్టి
    పట్టివానిని నడుగుఁగ న్పుట్టువాని
    నెఱిఁగి కేలెత్తిచేమోడ్చి యెంచికొలుతు. 10

ఉ. గట్టులచుట్టువన్నెనఱకు కొక్కసఁపుందొర దొంగబిడ్డ పెం
    దిట్టపుటేడ్తెరల్ నెఱియఁ దెల్పునఁగబ్బము సేయుమువ్వురన్
    గట్టబిగించిసంద్రమున గట్టడిసేర్చిన వెన్ను వేల్పులన్
    గట్టునవెన్ను నకటాతల కబ్బపుటిర్వురనెంతునెమ్మదిన్. 11

చ. మినుసిగవేల్పుజక్కఁ బుడమిందగుపుట్టువునంది యొక్కము
మ్మొనయడిదంపుసామి జగముల్ గనఁ బెంచ నడంపనంచు సా
టినకతఁ గూర్చుకబ్బపుగడిందిమగండగు పాల్కురయ్యని
మ్మనిమదిఁ దమ్మినిల్పియన యమ్మదలంతుఁ గలంతుబన్నముల్. 12

చ. కననిదియంటకల్ల యెఱుఁ గంగనరానిది యొక్కఁ డెల్లయున్
గొనుమిదిలోనవెల్వలఁద గుంగల దిద్దియనంగ నైననే
నను నెడఁగల్గుదీనినగు నట్టులయుండుమటంచుఁ దెల్విగొ
ల్పినయయవారియంజలకు లేఁకులయంజల లేఁకినయ్యెదన్. 13

వ. అని యిత్తెఱంగున మఱియుం గోరికలొసంగు తెఱఁగంటి మేలుబంతు
లవేడుకొని నిబ్బరంబగు తల్లిబిడ్డలకబ్బంబుమానిసి బెబ్బులులనుబ్బ
నంగొనియాడి యిమ్మెనిబ్రతుకు తెరవునిరవునకు నమ్మానికుదిర
కలకు నెమ్మదిగలుగంజేయు తెల్వియొనగూర్చు నయవారియడుగుఁ
దమ్ముల తేనెవాఁకలమునింగి యేదేనేమొకకుండపుట్టువుమునిమను
మనిసేయుపదునెనిమిది పొత్తమ్ములలో నడిసన్నవేల్పుమిన్నకతఁ
దెలుంగుసేయంగోరి డెందంబునం జిగిర్చిన సంతసంపుఁ దీవెపాదరింటి
చలువలం దేలుచున్నయెడ నొక్కనాఁడు కలలోన. 14

సీ. మించుతో మొయిలునా మేలిమియొల్లియ
యొఱపుటొయ్యారంపు యొడలుదనర
పొడుపుగ్రుం కెడుగట్లఁ బొదిద్దుజాబిల్లులో
నాఁజుట్టువాలుచిం దంబులలర
వెలిదమ్మిమిన్నేటి యలయంచవెలదినా
ఱొమ్ముమానికముపైఁ గొమ్మనిలువ
కెంపుపైమగఱాల గుంపునింపులఁ బోలి
కెమ్మోమ్మిఁజిఱునవ్వు క్రేళ్ళువాఱ

గీ. నన్నెగనుఁగొనుచూడ్కితో నాదునుడుతె
వినెడివీనులతో బయల్ వెడలి పొరలు
నెనరుమదితోడ నెవ్వానిఁగనరొ యెవ్వ
రట్టిసిరిమగఁడెదురఁగ నప్పటైనంత. 15

2-6806
25-3-33

# సర్వముఖర పత్రికపై

( చల్లా, పిచ్చయ్య శాస్త్రి గారు. ఇంటూరు. )

చ. లలి నునుఁబూవుదేనియకొ, లంకు కెలంకుల మేలి చల్వదు
వ్వలువ చెఱఁగుఁ గేలఁగొని, పయ్యరసైకె మొగిసాగు కైతయు
గ్మలి మన ముగ్గుపాపయ జ, గాజిగి యల్లికకాని క్రపవుం
బలుకులు వీనదోయి నెగు, బాటుగొనన్ మరలెం గదా తమిన్.౧

సీ. తీరుగా సీసప, ద్దెమ్ము సాగించుచో, శ్రీనాధకవిరాజు సిరులుగురియు
జిలుగుబూబాదలమచ్చికలనల్లించుచో, నలసాని పెద్దనయనువు నెనయు
ఎడఁదలోతుల నెల్ల, మెడలను బాఱుచో, జక్కఁగాఁ దిక్కన చక్కిఁజొక్కు
క్రొందేనెయూటపల్కులవాకదోగుచో, ముకుతిమ్మనార్యునిముద్దు నెఱపు

గీ. అరరెయభినవకాళిదాసాంకితునిమహాకవినిముగ్గుపాపయప్రాజ్ఞవరుని
మధురమాధవవేళలమరఁగినట్టి, ప్రౌఢకవితాలతాంగికే, ప్రౌఢియేమొ.

ఉ. ఉచ్చసమస్తశాస్త్రముల, నొక్కటఁ జూఱలుగొన్న గీష్పతిన్
మెచ్చనివాఁడు పాపయమ, హీషి మహాకవి యట్టిపెద్ద యి
ట్లచ్చతెలుంగుసేత యుడి, యాసలపోఁకల వారిమెచ్చుకం
చొచ్చెములేక తోఁచె నొక, యూహ యెటైనఁ దెముఁగులెస్సకే.3

శా. నిట్టూర్పున్ నిగుడింపఁ జేసిన పదా, నీకంబు లే దెక్కడన్
దట్టుం గుఱ్ఱము తోడు గన్న నడయే, దారిం గనన్ రాదు మే
ల్పట్టా గాంచిన పాపయార్యకవితా, ప్రౌఢప్రపంచమ్మునం
దిట్టఁ ట్టంచన నేల తెల్గునుడి మె, ట్టెక్కించె బల్పట్టుగన్

చ. ప్రభువులు బాడితల్ కవులు వక్త్రవధానులు నెల్లవారు స
త్ప్రభ యిది క్రొత్తక్రొత్తయను, పాటకు మీటు యశఃపురంధ్రిమం

దుభి పచరింప హాయి డలిఁ, దోఁచినటో యన నొప్పె నప్పు డా
యభినవకాళిదాసకవి, యింతటివానిఁ జూడఁ బోటుఁకర. ౫

సీ. ఒకసారి సునుదావు లోలయు పూబోదరిండ్ల, నలవోక దీవెయు
యాల్యలులూఁగు, నొకమాటు సోలుపా, టొదవించి నెఱిమించి, గోన
బు ముద్దుల పీసెఁ, గుల్కమీటు,నొకతూఱి కఱ్ఱంపు, టొప్పు తిప్ప
లనెక్కి, పంగువెన్నెల, కల్కిఁ, బల్కరించు, నొకపఱి యేమేమి,
యో క్రొత్త లెనఋంచి, బాగారునకుఁ దావి, బయలుపఱుచు,
గీ. ఘనునినంతటి యభినవ,కాళిదాసు జెట్టఁబట్టినమేల్కొంత, చెలియమిన్న
చాగు శేరాచబిడ్డయోజాణపాటుకత్తె యొకలట్టిదో శల్కుగల్కి యొక్కొ.

చ. పరువున లోతెఱుఁగక యు, పాధులనమ్మిన వారలెవ్వరో
యరిగెను ముల్గుపాపయ గా, హాకవి యాదురుగాని యెల్లసం
బరఘులు దామనై మధుర, భావమునం దగువారు నిన్నిరం
తరమును జూచు చుందురు గ, దా నవతా కవిరాజశేఖరా. ౭

చ. సమరసభావ మొంతయును, జాల్కొన వైష్ణవగాధయుంది స
క్రమముగ వ్రాసె సర్వమధు, రంబ ననామము సార్థకంబుగా
గొమరునఁ దావు కల్పనలు, కుత్తకబాటి రసమ్ము వాక భా
వము తెలిదీని కూరుపు నె, బాసున దండిగదన్న చెల్లరే. ౮

సీ. విక్రమాదిత్యభూవిభునిసత్సభయందుదగి మహాకవికాళిదాసుఁడయ్యె
బుధజనామర భూజ,భోజరాజాస్థాన మండలిభవభూతి దండియయ్యె
రాజరాజనరేంద్ర రాజత్ సభాపీఠినాంధ్రభూమిక నన్నపార్యుఁడయ్యె
శ్రీకృష్ణదేవ భూ భృత్పరిషత్తునన్ ఘనతమై యష్టదిగ్గజములయ్యె.
గీ. వాసిఁదగు వెంకటాద్రి భూ, వరునిగోష్ఠి
ములుగు పాపయ కవిరాజ, తిలకమయ్యె
భగవతి సరస్వతి జగానఁ, బ్రభితిఁగన్న
యత్తు యవతారముల షక్కి నందె నొక్కొ.

ఓమ్.

శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

# సర్వమధురము.

## మొదటివిన్నపము.



గౌరీ మధురాధరాధర సరస్సీమామృతాహార వే
శాగర్జద్ద్విజ నిస్స్వనజ్ఝర గోళ స్థాస్ను వేధోండ సో
ద్వేగాన్యోన్య విమర్దశాబ్దిక సమావేశానుసంధానకృ
ద్రాగోద్యత్పరిరంభసంభ్రమపర బ్రహ్మాఙ్ము మేలీవుతన్.

ఉ. సింగఁపుజక్కిఁ దోల్పులుకు చెంగులపల్లము పైబిగించి గో
ట్టంగొనయక్కరంపుమొగ డఁ జళిపించుచు ముగ్గొనంపుటే
నుంగులు నుగ్గునూచమగు నోయన మీఁదఁటియాకసంబుపైఁ
జంగులువాఱుతల్లి మము సాకెడుఁ గట్టులతేనిపట్టియై. 2

సీ. కలువరేసయిదోడు చిలువచాలెకిమీఁడు
చెలువగాఁ బవళింపుఁ జలువగాఁగ
మున్నీటినడినాఁడు మిన్నేటితలవాఁడు
వీడుగా సయ్యాటజోడుగాఁగ

బంగారుజరివల్వ పొంగారుదువ్వల్వ
గట్టుగా బిగియించు దట్టిగాఁగ
వెల్లమోరపులుంగు తెల్లవార్చువెలుంగు
జక్కఁగాఁగొలువుండు చక్కఁగాఁగఁ

గీ. చేరుసంద్రంబు వెలిదమ్మిఁజేరుతఁసి
తలపులోనగూర్ప దెసలెల్ల వలపుఁగూర్ప
వెలయునేవేల్పుదోసఁగుల వేరువిత్తు
దలఁతుడెందమ్ము నెత్తమ్మిఁ దమ్మికంటి. 3

ఉ. తల్లులుకంటగాని పజఁ దన్నుటకెవ్వరు పాలు వంటకం
బొల్లెలు సొమ్ము లిండ్లు ముదు లుగ్గులులెల్లవితానయూటయే
తెల్లముగానఁ దల్లియని తెల్పఁగనౌననియంచునెంచి నేఁ
దల్లికిఁదల్లియైన మరు తల్లిఁ దలంచెదనుల్లమియ్యఁగన్. 4

మ. నుదుటన్ వ్రాసినవ్రాఁతకన్నఁగలదే నూత్రేండ్లలోనంబడిం
బదిగానెంచిన నిందుకింకనొరుఁ డె మ్మైకల్గునే యెల్లరున్
మదిఁగొల్వంగ నతండుసూ దెసయెటుల్ మన్నింపమింజెట్టయూఁ
గద కొల్వందగువేల్పునల్వయని యక్కర్జంబెనేనెంచితిన్. 5

సీ. నడనీటురాణెంపు నకు వేఱపొగడేల
నంచలందడియాడు టదియయెఱుక
మముబోటిబిడ్డల మన్నించుటన నేల
తలవాకిటననిల్పి మెలఁగుటెఱుఁక
మొదటిచొక్కపుఁ గొన మ్మునెలంత యన నేల
వెలివెలుంగులమేని తళుకుటెఱుక
కరఁగినీరగుడెంద మిరవువేల్పననేల
నిచ్చవీణెయసౌఖ్య నెఱపుటెఱుక

గీ. ఎందఱెందఱుఁగనిన నం దాదుమేలుఁ
జెందఁగలదేమితెల్విగ లందుకట్టి
యమ్మనెమ్మదినమ్మట సొమ్ముసుమ్మ
టంచుఁబల్కులప్రోడకాసించువాఁడ 6

మ. సతసంభ్రమంబులఁ బిల్చి మీఁదికి వెలార్చన్ నిక్కి చేముక్కు జో
పితి వజ్జలెగడా మొయిల్ గురియుటల్ పెక్కండ్లుగా దేపొగన్
సతమే వానయుటంచుమించ జగమెం చం బెంచునీలావుగా
వృతమమ్మున్ వెనకయ్య నీ వెనకుత ప్పల్ పాచి కాపాడదే. 7
చ. పెనఁకువ దిండిపై నెనరు పెంపదియెట్టిదొ కూడు గూరలున్
నిని చెదుపాట్టయుబ్బ నన నిచ్చలు రక్కసిమూక, నెల్ల ద
క్కినయెకిమీని యిల్లడుగుఁ గ్రిక్కిరియించితియాపిపైనఁ బె
ల్చననిడలేద యోహనుమ చాలును మాపగలున్ గుడింపఁగన్. 8
సీ. ఇల్లాలినుదుటిలో సెనయూటనేకదా
కలువతేసికపూవుఁ గట్టినాఁడు
జోగిమాలిలేఁగొను, జోలుటనేకదా
మీసపెద్దతలగాఁగ నునుచినాఁడు
జవరాలిమూడ్కితో సరియూటనేకదా
బళిజింకపిల్లఁజేఁ బట్టినాఁడు
మంచాలికీల్జడ మూడ్కి యూటనెకదా
చిలువపెండేరమ్ముఁ జేర్చినాఁడు
గీ. ఇంతసింగారమునవిచ్చ నెలయువేల్పు
కలఁడె వేఱొక్కఁడనినాడు కబ్బమునకు
నెల్లసింగారమొనగూర్ప నుల్లమునను
వేడుకొనియెదజన్నంపు వేటకాని. 9
గీ. పుట్టపైఁ బెట్టువానినిఁ బుట్టలోనఁ
బుట్టువానినిఁ బుట్టియుఁ బుట్టనట్టి
పట్టివానిని నడుఁగుఁగ న్బుట్టువాని
నెఱఁగికేలెత్తిచేమోడ్చి యుంచికొలుతు. 10
ఉ. గట్టులచట్టువఱ్ఱనటికు కక్కసఁపుందొర దొంగబిడ్డ పెం
దిట్టపు లేడ్తెరల్ నెఱయఁ దెల్గునఁ గబ్బము సేయుమువ్వురన్
గట్టబిగించిసంభ్రమున గట్టడి నేర్చిన వెన్ను వేల్పులన్
గట్టున వెన్ను నక్కితల కబ్బపుటిర్వుర నెంతు నెమ్మదిన్. 11

చ. మినుసిగవేల్పుజక్కఁపుడ మిందగుపుట్టువునంది యొక్కము
మ్మొనయడిదంపుసామి జగముల్గనఁబెంచ నడంపనంచుసా
టినకతఁగూర్చుకబ్బఁపుగ డిండిమగండగుపాల్కురయ్యని
మ్మనిమదితమ్మినిల్పియన యమ్మొదలంతుఁగలంతుబన్నముల్. 12
చ. కననిదియంటకల్లయెఱుఁ కంగనరానిదియొక్కఁడెల్లయున్
గొనుమిదిలోనవెల్పలఁద గుంగలదిద్దియనంగనైననే
ననునెడఁగల్గుదీనిసగు నట్టులయుండుమటంచుఁదెల్విగో
ల్పినయయవారియంజలకు లేఁకులయంజలలేఁకినయ్యెదన్. 13
వ. అని యిత్తెఱంగున మఱియుం గోరికలొసంగు తెలుగంటి మేలుబంతు
లవేడుకొని నిబ్బరంబగు తల్లిబిడ్డలకబ్బంబుమానిసి బెబ్బులులనుబ్బ
నంగొనియాడి యిమ్మెని[బతుకు తెరవునిరవునకు నమ్మినికుదిర
కలకు నెమ్మదిగలుగంజేయు తెల్వియొనగూర్చు నయవారియడుగుఁ
దమ్ముల తేనెవాఁకలమునింగి యేదేనేమొకకుండపుట్టువుమునిమను
మనిసేయుపదునెనిమిది పొత్తమ్ములలో నడిసన్నవేల్పుమిన్నకతఁ
దెలుంగుసేయంగోరి డెందంబునంజిగిర్చినసంతసంపుఁ దీవెపొదరింటి
చలువలం దేలుచున్న యెడ నొక్కనాఁడు గలలోన. 14

సీ. మించుతోమొయిలునా మేలిమియొల్లియ
యొఱపుటొయ్యారంపు యొడలుదనర
పొడుపు[గుంకెడుగట్లఁ బొద్దుజాబిల్లులో
నాఁజుట్టువాలుచిం దంబులలర
వెలిదమ్మిమిన్నేటి యలయంచవెలదినా
ఆముమానికముపైఁ గొమ్మనిలువ
కెంపుపైమగఱాల గుంపునింపులఁబోలి
కెమ్మోవిఁజిఱునవ్వు[కేళ్ళువాఱ
గీ. నన్నెగనుఁగొనుచూడ్కితో నాదునుడులె
వినెడివీనులతో బయల్ వెడలి పొరలు
నెనరుమదితోడ నెవ్వానిఁగనరొయెవ్వ
రట్టిసిరిమగఁడెదురఁగ నప్పటైనంత. 15

గీ. మేలుకొనినంతఁదెలివితో మేలువాలు
గంటిమగనినిగంటి నే మంటి మేలు
గొంటినని మేను గరుపాటు గొఱలఁగేలు
దోయి జోడించి మ్రొక్కి య ద్దొరకు నెదుర. 16

చ. నిలుచుట నన్నుఁగన్గొని గ నింగను పేదయువోలెయున్న నా
తలఁపుమదిందలంచి కయి దండకుఁజేరఁగఁదీసివల్కె నీ
వలనఁ బనింగొనంగనిట వచ్చితి నీదగుకోర్కులిచ్చితిన్
వెలయఁగఁజేయఁగావలయు విన్నది తెల్పెదవిన్నవిందగున్. 17

క. మే మొకతఱిఁ దమిఁ బెనఁగొన
శ్రీమతినారాచపట్టిఁ జేకొంటిమి యా
చామకు మాకగు పెండిలి
సేమమ్మగు కబ్బముగను జేయఁగవలయున్. 18

ఉ. నీనుడిపంచదారపాడి నీపలుకుంజవి వెన్నకన్నమి
న్నా నినుఁగోరినారమని నాపయి కేలిడి దువ్వె యేగెనం
దో నటమేలుగాంచితిని దొద్దైసయుందెలవాఱె చీఁకటుల్
కానలకోనలందొదిగెఁ గన్బడెఁజ నిగమ్మతెమ్మెరన్. 19

క. తఱియగుసేతలఁదీర్చుచు
మరువంగారానితలఁపు మఱఁగినవేల్పున్
దొరయానఁదలకుసొమ్మై
యొరియుంగబ్బంబుసేయ నోజఁదలఁచితిన్. 20

——* షష్ఠ్యంతములు. *——

క. గట్టులఱేపట్టికిఁ దమిఁ
దొట్టి యొడల్ సగమొసంగి తొడవుగ నెలపైఁ
బెట్టి జడల్ జుట్టి బిగం
గట్టిన జగజెట్టియైన కఱకంఠునకున్. 21

క. ఘడలంజిఱువలసొమ్ములు
నడలంబ్రాఁబల్కుటందె నాదులకులుకుల్

జడలంగెంపుతళ త్తళ
మెడలందనుపాఱునల్ల మెఱుఁగులదొరకున్. 22

క. వెలుపలలోపల వెలుఁగుచు
వెలుఁగులనన్నింటిఁదాన వెలయించుచుపై
వెలుఁగులదొర వేవేలన
వెలయుచుండాలేక యెల్ల వినువెరవరికిన్. 23

క. మ్రొక్కిన నీవేదిక్కని
దక్కినతనపేరుదేనిఁ దాఁప్రచుమదిలోఁ
జొక్కినఁబుట్టువుగెడపెడు
కక్కసపుంజలముదిరము గాఁగఁలఁగనికిన్. 24

క. తెరవెఱుఁగక తనుగనినను
కరమరుదగు తనదునిజము నెఱపుచుఁబట్టాల్
సెఱపి పజఁదన్నుతిలిపెడు
సిరిమలమల్లునకు మాంచు సెలయల్లునకున్. 25

వ. అప్పనంబొనరిచి నాకూర్పుఁబూనిన యిక్కతనడచు తెరవెట్టిదనినం
దేటపఱుపంబూని యిక్కబ్బంబచ్చ తెలుంగునఁ బొసఁగించువాఁడనై
" అయోధ్య, శ్రీమతి, అంబరీష, నారద, పర్వత" సర్వమధురంబు
లను పలుకులకుందక్క మొదటిబాసనుడులకుం బలుకుండులేక
చెల్లునది. 26

## కథాప్రారంభము.

ఉ. రేఁగులగడ్డపైఁ దపసి తేదొరలందఱు గుంపుగూడి లో
మూఁగిన సంతసంపుఁ బెను మూఁకలుగట్టఁగఁ బాఱుటెంతెత్తో
రాఁగలయంగఁగల్గిన తి రంపుఁగొలంబు వలంతియంతక
న్నోఁగులవిందొనర్ప నుడి సోయగముల్ పచరించిరొక్కెడన్. 27

క. శ్రీమతియనురాచూలిం
దామరవిరికంటి కేలు దమ్మిం గొనెనం

చేమోవింటిమి తెల్పుమి
యామెతగద డెందములకు నామెంతలంపుల్. 28

క. అనినం బ్రాఁబలుకుల చి
క్కనుపొందగఁజేయువాని యనుఁగిట్లనియెన్
ననుగాలిమేఁతపానుపు
టనువరిముచ్చటలవినుఁడ టంచువలపునన్. 29

—* పురవర్ణనము. *—

చ. సిరులకునాటపట్టు సరిఁ జెప్పఁగఁ జూపఁగరానితావు పో
టరులకు టెంకి చొక్కపుఁ గడానిబిడారము మేలుతాలగు
జ్జరి విరిబోండ్లయందపుఁబసారము ముక్కలవేల్పువంగడం
బిరవునయోధ్యనాఁబుడమి కెమ్మెయనందగుపీడుమెచ్చఁగన్. 30

క. మేడల తెలి తళతళ సిరి
కోడలితోఁ దారసించు గోడలపొడవుల్
నీడల వేడి వెలుంగుల
పోఁడలలింజొరఁగనీవు పోకతతేలా. 31

సీ. ఏనాట రాచూలి యారేఁడుజగములఁ
బుట్టింపఁ దానయ్యెఁ బుట్టినిల్లు
ఏపీటిదొరబిడ్డ యెల్లదోసముపున్నె
ముగమిన్నువాకఁగ మ్మురవడించె
ఏపోలిమెకిమీని యెలమివేల్పులతేని
మన్నినితనమునె మ్మదిఁబూసంగె
ఏటెంకియొడయ ముస్నిటిపోటరికంబు
గడియలోనతనిలోఁ గలఁచివైచె
గీ. అట్టితేఁడులకాటపట్టైనయట్టి
యయ్యయోధ్యకుసాటిసే యంగనెద్ది
వేదలలవాన్నికైన నవ్వీటిసొబగు
లెక్కసేయఁగఁ దలఁపు లమ్మక్కగాదె. 32

సీ. మగఱాలకంబముల్ మలఁచి పైఁ దెలిగంటి
దోరఱాతిబోదియల్ దులుఁగలింప
పగడాల దూలముల్ పఱచి చొక్కపుఁబచ్చ
పలక సందీకుండ నలవరించి
అపరంజిపూఁత సోయగము తళుక్కులుదేఱఁ
గలుకుముత్తెఁపు మేలు కట్లుదనరఁ
దఱుచు చిత్తరువు చిత్తరము రెండవనల్వ
చెయువులయొడికంపుఁ జెలువుఁదెలుప
గీ. నిండుటందంపుమేడల నీటు చదలు
వాకవాడలజాడ మవ్వంబుఁజిలుక
వాడవాడల వెలితి యేర్పడమి నందు
లేమినిలుకడ కేవంక లేమి దెలియు. 33
చ. తొలినుడు లంచ తేజిదొర తొక్కడపుందలవాకిటన్ వెతన్
నిలువక వీట బుట్టువుగ నెంగదయందు ముహాఱువార్లై
కలదొకొయిట్టివింతయనఁ గాఁబనియే మికయన్నుదుల్ బలెన్
బలువిడియత్తెగల్ గలుగ బ్రాతిమెయట్లనఁగాజగంబులన్. 34
క. అవ్వీట రాచబిడ్డలు
పువ్వులదొరసికలఁబడనిపుట్టువు లెసుమీ
మవ్వంబునఁ బగఱయెడం
జివ్వాల జగమడగు తఱుల చిచ్చరకంటుల్. 35
క. వలిమల యల్లుని ముందటఁ
జెలికానికిఁ గలిమి నవతఁ జెందెనటంచున్
దొలితొలినగియెడి మూడఁవ
కొలపుంగుంపులకుఁ బట్టుఁ గొమ్మైయలరున్. 36
ఉ. నాలవవారిచట్టములు నాలుగుగుంపులసామిరూపులన్
నాలుగుఁబుచ్చి మీఁదఁగలనాలవవానికి వేఱునిచ్చి య
న్నాలుగుసంద్రముల్ తుదయ నంబొలమెల్లను నేరుసాగుచున్
నాలుగువైపులన్ బొగడు నందెలువొందిరి పంటకాపులై. 37

క. గందంపుగొండ నెత్తఁపు
గందపు మ్రాఁకులను వీటిఁ గైకొనిపో తా
రందుడిగి కమ్మతెమ్మెర
లిందు మెలంగెడు ననంగ నెప్పుడువీచున్. 38

ఉ. మించులమించుసంచు నును మేనులు కొనులు నింగినేలు రా
యంచలు నెన్నడల్ దొడల యందమనంటులు పల్కుచక్కరల్
నించునెలంత లించువిలు నేర్పరినేర్పడముజ్జగంబునే
లించఁగఁజాలుకీలుగమి నింపగుచందముగందురందులన్. 39

చ. కలుములకాటపట్టులగు కందువ రేయిరవొంది తమ్మిలి
మ్ములఁదనరం బవల్ సెలఁగి ముచ్చట లచ్చట లెల్లఁదీఱఁగాఁ
గలిమినెలంతకాపురము గా నిలువం గడుఁదిమ్మనంబులై
కొలఁకులు పెక్కుచొక్కమగుఁ గోటలఁ బేటలఁదోఁటలందునన్. 40

క. తమ్ములము లేని వేలుపు
గొమ్మల కిడునాఁగఁ బోఁక కొమ్మలతుదలన్
గ్రమ్మిన యత్తివెలత్తో
నిమ్మగు నెలదోఁటలందు నెసఁగుంబొడ్డనై. 41

సీ. మున్నీటిగారు నె మ్మోమము వెల్వెలఁబాఱఁ
బొంగి మిన్నలము నే నుంగుగములు
తమ్మిచుట్టము తేజి దాఁకి మింటికినంటుఁ
దాకెడు గుజ్జంపుఁ గూటువలును
మింటిగేస్తులకిల్లు వంటకంబిడులిబ్బు
లందీడుమెచ్చని యరదములును
తెఱనోటిమెకము వా తెర ముద్దుఁగొనునట్టి
కడిమి పోడిమి పోటు కాండ్రమూఁక

గీ. లిత్తెఱఁగు దండుమొత్తమ్ము లెచటఁగనిన
నింగి నేలల సందిఁక నెగడుపగఱ
చూపుమొక్కల కిసుమంత చోటొసంగ
కెసఁగు నవ్వీటిబలిమి పెం పేర్పడింప. 42

సీ. పడఁతి ! పయ్యెద మాటు పఱచి బంతులు డాచి
చూపవింతనయింపు చూట్కి-చనునె
వెరపెంపు దనుపాఱ వెలయింప కిటుచూచి
నంతరమ్మున వచ్చు న దియుఁగలదె
పట్టిచూడక మెచ్చు పుట్టకయెందైన
వెలపెట్టిసొమ్ములు విలువఁదగవె
చేఁజిక్కి-నంతలోఁ జెనకి పైనల మిన
కందుటొక్కఁడు మరల్ నెందుటొక్కఁ
గీ. డనుచునిటుఁగోడెకాంౘడతో ననుచుఁగూర్మి
ననలువిలుచునెపంబునఁ జనవుదార్చి
తుంటవిలుకాని బిరుదురా తులాయనంగ
ననలయంగళ్లనవలాల నలువు సెలఁగు. 43
సీ. కటికిచీఁకటిలంకె కాపురంబులుమాని
పుడమిఁజేరినచిల్వ పొలతులనఁగ
విడియంపునెట్టచే వేల్పుతా వెడలివ
చ్చినయచ్చరలలోని మినుకులనఁగఁ
దనతూనికపుబొజ్జ యనువుదెల్పఁగనేల
చేడియగనుముద్దు చిరుతలనగ
ౘబతుకెల్ల మబ్బుల పాతాటసడలియ
చటఁజేరుమెఱుఁగుల చట్టమనఁగ
గీ. నడలనంచలు దొడలన నంటు లొడల
పైడి జడలమొయల్నాగఁ బచ్చవిల్తు
నమ్ములకుఁ దీఱుఁబాటుగా ముమ్మరంపు
వలపుఁబుట్టింతురచ్చోట వెలనెలఁతలు. 44
క. కుందెటికొమ్ములుఁబలె చద
లం దామరలట్లు మడువు లంజిచ్చులునా
గుందనఁపుంగందములై
యుందురు కల్లరులు చీఁకు లోలింగనఁగన్. 45

గీ. తెల్లదేవరగుడులందుఁ దీర్పుఁగనిన
చాలుమగతాలగిబ్బల చక్కఁదనము
తెప్పవేయకకనుటనో యుప్పరమున
మింటితెరవరిగమి తెఱ గంటియయ్యె. 46

చ. వలమురిదాల్పురూపుగొని వచ్చెను పోయెడునాఁడునాటికిం
దొలకిని పుట్టులేమిఁగొన ద్రొక్కడలేదు కడంగనంగ నం
చలమినయాస ముజ్జగము లందలి మాకలు ప్రోవులయ్యెనా
నలవున సూదిమోప నెడ మందుఁగనంబడదప్పజంగడున్. 47

సీ. పగఱగుంపుల మూలఁ బట్టించె నేర్పుమా
నికముల కడలియై నెగడుఁగడిమిఁ
దనమూపుసోకినం తన పేదజికముల
మింటిపుర్వులఁజేయు మించుకీవి
చెలువంబుగనినఁ దొయ్యలులకన్నోసగల
వలరాజుఁ బడియు నివాళిగాఁగ
రొక్కంపు నిండారు లెక్కింప ముక్కంటి
చెలికానికలిమినిం జిలికిఁగాఁగఁ

గీ. నింగి నేలల నడుమెల్ల నిండ యెసవు
కప్పురమునించి యొప్పుల కుప్పయగుచు
నాల్గుచెఱఁగుల పుడమియం తయునునేల
నంబరీషుండు తేఁడుగాఁనలరుపీట. 48

క. ఈవులుఁ జాగఁపుమ్రాకుఁల
తీవులు నిక్కంపుఁదేనె డిగ్గియలునుడుల్
వేవేల రాచమానిసి
ప్రోవునసీతేనిదొరయఁ బోఁడెవ్వాఁడున్. 49

సీ. పవలురేజిగిగల్గి పఱగుటఁ జెలువరా
కలువరాయుడికాండ్రఁ గెలిచినాఁడు
పోరాటములవంగి ప్రోవుదిట్టతనంబు
కలిమిమేలిమిగట్టుఁ గలఁచినాఁడు

హెచ్చుగుందులు లేమి నెందులోతివ్వక
పాలమున్నీటిలోఁ బఱచినాఁడు
తపసియీఁసులసిరుల్ దఱగమి నెమ్మేని
చూపులదారఁ జుల్కఁ జూచినాఁడు
గీ. నడకతిన్నదనంబున నుడులనొండు
తెఱఁగుఁగాంచమిఁ జిలువరాఁ దెగడినాఁడు
రాల మగఱాల మిన్నలొ రాయనంగ
నంబరీషుండుదగఁడెవె య్యారులందు. 50
గీ. అప్పుడమి తేనిఁగను,గొన నబ్బె నేని
గుప్పుగుప్పున నవలాల కొమరుగత్తె
లురులుగొనఁ బూవువిలువైచి యుసురుసురని
చిలుకతత్తడి పనిలేమిఁ జిన్నబోవు. 51
మ. గడకుంగొమ్మునగంటఁగట్టి పొగడుం గబ్బంపువారెవ్వరే
నడుగం గోరికలిత్తునంచు నతఁడ య్యారే సిరుల్ గుప్పఁగాఁ
బుడమిన్ లేమియనంగ మందయిచెడెం బో యీవికెమందునెం
దడుగం బేదయనంగ లేఁడుగద యౌరా ! వానిమేలెంతయో. 52
ఉ. నేలకు నింగికిం దొరలు నేటికిఁ గన్పడిరిక్క డిందిరా
చూలియు గట్లగొంగయును సూవెయికన్నులకల్మి నిక్కవం
బేలెడిచోఁగనంబడియె నీతనియందునటంచు నిండులో
మాలిమిగొంచు వేల్పుసిరి మారగుపెన్నిరులొందిరదఱున్. 53
సీ. తెల్లదామరపూలు దేవరగుఱ్ఱంబు
నేనుంగునడిదంబు నానవాలు
నెలఱాలుప్పిట్లు నిగ్గుచుట్టంబులు
తలిదండ్రులతివలు నెలయమంచు
మినుగిడ్డిచెట్లు మినుసికవెలుపు
టిల్లుతత్తడిసొమ్ము లింతియయ్య
కొఁడుకుపుట్టిల్లు సంకులుచుక్కవాల్దాల్పు
ముత్తెముల్ మగఱాల మొత్తములును

గీ. నతనియసముల: తళతళ లనుచుఁబొగడఁ
బొగడుఁగను రాచ యెకిమీని బుడతలందు
రిక్కగమిలోన జాబిల్లి చొక్కమలరి
యంబరీషుండు తనసాటి యయ్యెఁదాను. 54

క. పగఱలనణఁచుచునారా
తొగరాచెలువందెనిరుల తుటములనెల్లం
బొగరడచివెలుఁగువెలుఁగుల
తొగరుందేవరయసంగఁ దురములదిటమై. 55

క. చేకొనిచేవాడిం బెఱ
రాకొమరుల సిరుల పెనుదు రంబులనింతే
గాకల మరునిదురంబులఁ
గైకొని చిగురాకుఁబోండ్ల గరువపుటెదలన్. 56

క. మావుల దఱుచగుతోఁటలు
వేవేలనఁగోటులట్లు వెలయుచునింపోఁ
దావుల మేనుంబ లెఁదన
కేవెంటం బుడమియెసఁగ నేలెనతండుṟ. 57

సీ. ఎత్తివేయుటజెట్టి మొత్తంపుఁబట్టుల
చేకట్లురారాపు చిగురబోండ్ల
ఎదిరించియూచుటు య్యెలలపైజతగాంద్ర
రాకట్టుబిగువుటుం గ్రములగములు
వడవడిలేమినెం తయునుజూలాంద్రుల
పదఱుటవెనకయ్య పందువులును
లేదులేదనుపల్కు లేమలకొనులు
వలవైచితిగుచుట వాలుగులును

గీ. గాకయొండొక్కచో లేక కలిమిబలిమి
చెలిమిదులకించి పంటనె చ్చెలిఁజెలంగు
నెల్లవారలనేలుచుఁ దల్లితల్లి
చూలునానెప్పునంబరీ షుండుపుడమి. 58

క. అంచుల్ మ్రోయఁగ నరదము
మించుం బలెఁ బుడమి యెల్ల మెఱపుచుఁ బగఱన్
ముంచుచు నంపరసోనల
మించెన్ మొగులనఁగ రాచ మేల్బందిబళా. 59

వ. మఱియు నప్పుడమిఱేఁ డొప్పులకుం గుప్పచొప్పడరంగ నిక్కంబునకు నిక్కయు నేర్పులకుం జేర్పును నోర్పులకుం దార్పునుఁ దీర్పులకుం గూర్పును నీవులకుం దీవియు బీరంబులకుం దోరంబును సిరులకు నిరువును నిలుకడకు నెలవును ప్రోడతనమ్మునకు నీడయు ఠీవులకుం ఠేవయుఁ దేటలకు నాటపట్టును గలిమికిం బలిమియు వీఁకలకుఁ బ్రోఁకయు జల్లదనంబున కిల్లును నెనరునకుం దోనయు నునైదనవారునుం బెఱ వాఱునుననునవిమాని కావంబ్రోవ నొక్క తెఱంగున నిండారుకూరిమిఁ బెనంగు నెఱతనంబునం బొంగియులోతియ్యని నెఱవాదితనమ్మున నెల్లరకుం గరువలితోడగు నెరగలి పొంకం బంకించుచు నొక్కొక్కమొడలం గడానిసోనల నెయ్యురం దలబంటిగ ముంచుచు నిండోలగంబుల నలువ చెలువ సయ్యాటమ్ములఁ దేనెలురలం బుడమి తెఱగంటి యెఱుకలిమూఁకల మెచ్చించువారల లేములకు లేమిదొరలించి చాగపుమ్రాఁకుల జోకం దెరలించుచు నేనుంగుల తత్తడులం దేరుల నెక్కి పెక్కుతెరంగుల వేటలాడుచుం బడంతులపిండుల మెలంగుతఱి విరిలకోరిజోదువడువున విడరానితమకంబులఁ బొడమించి గడిదేఱు నెరజాణతనంబుల మొదలి విడెయంబులందు నందులకుం దానయొజ్జయై సరిలేని తేకువం బొసంగుచుండె. 60

మగఱాలన్ జిగిమీఱి మంచుమలనా మన్నింపనా మేడపైఁ
దొగరాఱాలయరుంగున న్నిగనిగల్ తోరంబులై యొప్పఁ జె
న్నగు సింగమ్ము మొగమ్ము గద్దియకు ని వ్మాసొమ్మునా నెమ్మిలే
మగువల్ చామరలేయ నయ్యొడయుఁ డింపొసంపు గన్పింపఁగన్. 61

సీ. అపరంజిరేకులో యనుపండుటాకుల
మడుపులు వ్రేళ్లలో మాటుపడఁగ

చిరునవ్వుజాబిల్లి జిగిఁగొరువెన్నెల
    పులుఁగులువలెఁ గన్నులళుకులీన
కదలకనిల్చుచొక్కముగాంచుతొలుకాఱు
    మెఱుఁగునా నెమ్మేని మెఱుఁగులొప్పఁ
గొనవ్రేలిసందుగీల్కొనినబాగమ్ముల
    పెట్టెయుంగ్రములతోఁ బెనఁగులాడఁ
గీ. దనకునిసుమంత యోరగా వెనుకనిలిచి
కేలఁ దమ్మలమిచ్చు నిల్లాలిఁ జూచి
చదురులాడుచు సిరిగూడి చదరుసేయు
వెన్నుఁడనఁ గొల్వుసేయురా జన్న యెడను. 62
మ. సటలొక్కుమ్మడిగుంపుగా మెఱుఁగుచాల్ చందంబులీనన్మయిం
దుటముల్ గట్టినబూదిగాద్పుదెరలన్ దుమ్ముల్ దువాళించి యొ
క్కటఁ గ్రంపుటనంటిచాలెనయఁజక్కన్ బాసవాలుందొరల్
తటకాపాటునవచ్చిరచ్చటికి నెల్లారుందముంజూడఁగన్ 63
గీ. పంటలవలంతిమగఁడు సంబరము తిరము
గాఁగనెదురేగి దోఁతెచ్చి కసటువాయు
తళుకురతనంపుగద్దియఁ దార్చిమ్రొక్కి
యడుఁగుఁదమ్ములఁబన్నిటఁ గడిఁగిపూనె. 64
చ. కరగలిఁగాయలం గడుపు కాకలడంచి సరించుపారువా
రరుదుగఁ గండచక్కెరలు నావులపాలును నేతితేనెలుం
దొరయిడఁదన్పునట్టదనిసి త్రోసిరిమూలకు నందరానిపె
న్నురిగను సంతసంబుఁదము గూడిన నప్పటి సంతసంబునన్. 65
చ. తపసులుపల్కిరప్పుడమి దాలుపుతో నొడయండ ? నీవురా
నెపమగు తమ్మికంటివి యనింబగరంబనిఁ దీర్చుటెం తెకా
కిపుడరలేక లోఁబగఱ నెల్లఁగలంచితి వబ్బురంబు చా
గపుసిరులన్ యసంబెనసి కాంచితితొల్లిటిరాలతోనెనల్. 66
సీ. నిక్కువీనులజక్కి నెక్కునేలికసిరుల్
    సొకోరువవనివేల్పు జోకవీఁక

దుంతతత్తడిరౌతు తో సాటితేకువ
మెఱచి మెక్కుడుగాఁ యెల్మికలిమి
ఘున్నీటిమెలగోలు మొనగానిబీరంబు
జింకబాబాజోదు చేతిబలిమి
జక్కులచెలికాని రొక్కంపుసంతన
చౌవంచమోముల సాక్షిబ్రదుకు

గీ. బమ్మదేవరవిద్దియల్ దమ్మికంటి
నెనరుమక్కంటివిన్నాణ మునుబూసంగి
యెల్లతనువులకడమలే కీవురిక్క
గములుగలదాకచక్కఁగఁ గలుగుమయ్య. 67

క. నీవంటియొడయఁడేలమి
నేవెంటంబుడమిచేడె కెమ్మొగలదొకో
వేవెలుఁగులదొరపగటికిఁ
గావలదేయొండువెరవు కాంచంగలదే. 68

ఉ. ఇన్నియునేలబంగరున కింపుబలెన్నినువంటివానికిన్
వెన్నునిమీఁదనిండుమది నిల్పుటగావలెఁగానినాఁడు రే
మన్నియకానిఁబాయుతమి మాడ్కిఁగదాభువిఁబుట్టువిసిరుల్
సన్నలవచ్చుఁబోవుగద సంతలతో సరిమైనిజంబులే. 69

క. మేననగమించుసిరులా
చానలవలపులగుకుట్టసంతలవరదల్
గానగుకట్టద్రొంతర
లౌనేమనినమ్మదక్క ననిమెప్పటికిన్. 70

సీ. దెసలేలువారికే తిరిపెముల్గాలేదె
యేనుంగులెలుకలై యెసఁగలేదె
గట్టులొక్కొకసారి చెట్టులై వెలయవే
సింగముల్ కుందేళ్ళ చెలువుఁగనవె
మానుసుల్ మేకములై మనుటయబ్బురమౌనె
మింటికాపరిగాఁడె మంటికాపు

గాములై తగువారు పాములై మనరొక్కా
పాటువారునునాల్వవారుగారె
గీ. గొప్పపుట్టువులననేల గొఱతగలదు
కొఱతయననేలదోడ్తోడఁ గొప్పగలదు
తనదుతొల్లిటిసేతయింతకును మొదలు
పుట్టువెడఁబాయుత్రోవచేఁ బట్టవలయు. 71
క. కడఁగననిపుట్టుచావులఁ
బడి యిడుములబడలి నేర్పుఁ బాసి చిక్కై
సడలనిసంకిలిబందము
విడిపోవమిఁ బుడమిపుట్టు వీడరు చెనుగుల్ 72
క. ఎందఱుపని రెందఱుమని
రెందఱురానున్నవార లిన్నేలకునీ
సందడియరు దేతలపఁగఁ
గొందలమగుటెంతె యాసుఁ గ్రోవులుగారే. 73
ఉ. గట్టులుమీటినం గడలిఁ గట్టిన మింటికిదాడివెట్టినన్
జెట్టులుపీకినన్ బిరుదు జెట్టులఁద్రోచినఁ జిచ్చుమ్రింగినన్
బుట్టువుతప్పనే యరిది పోకలఁబోవుటవింత యేరికిన్
గిట్టుటతప్పనే కలిగి కీడులమేలులఁజూడకుందురే. 74
క. కావుననీ వెతద్రోయం
గావలువదె యొక్కగలిగ్గి కట్టడిజమునిన్
ద్రోవన్ వలువదె కావం
బోవంగలవేల్పుత్రోవఁ బోవన్ వలదే. 75
సీ. నీవాఁడననునంత నిలిచియివ్వెతవాఁకఁ
గలముచందమున న వ్వలికిఁదార్ప
నీకెత్తితినికేల నాకక్కసఁపుఁబాము
లెల్లఁ బేరడగంగఁ గొల్లఁబెట్ట
నీమఱ్ఱుఁజేరితి నామాలిమినినుంచి
మరులెత్తికొనఁజేసి సిరులొసంగ

నీకన్న నారు వేడ నాకట్టెదుర నిల్చి
చేయిచ్చి తనయుల్లెఁ జేర్చుకొనఁగఁ

గీ. జట్టువాలయ్యతో సాటిఁ బెట్టవేల్పు
లొట్టు బెట్టిన లేరింక నట్టిసామి
పట్టుకొని గొట్టుమిట్టాడు పుట్టు గెల్చి
మట్టుమీఱిన ముమ్మూర్తుల మెట్టుగనుము. 76

గీ. పాలమున్నీటియల్లునిఁ బట్టఁబట్టి
కేల నొకవిరియవ్వేల్పు కాలిమీఁద
నిడ్డవానికి వేలుపు గిడ్డిదొడ్డి
గిడ్డియగుచావుపుట్టుల జడ్డుదలఁగు. 77

సీ. చుట్టుగైదువు కేలి జోదు పేరితలంపు
కడమకానలనేర్చు కాతుఁబొచ్చు
పులుఁగుబాబావానిఁ బోరామి పైకోర్కి
బండంపుదావలజాం పములెపొద్దు
పచ్చవిల్తునితండ్రి మై మరులు వడసిమి
దోసంపు వేసవి తూర్పుగాలి
వలమురిదాల్పు కాల్బ్రోయు నీరానుట
చెడనీని కడలేని సిరికి నెలవు

గీ. తల్లికడుపునఁ బుట్టినం తన తనంత
మామమామకుఁ గుదురైన మగువ గలుగుట
ముందు వేవేలపుట్టువు లందు పున్న
మగ్గలంబుగఁ జేయుట యనితలంపు. 78

ఉ. ఒండొకజోలిమాలి మది నొయ్యనఁ దొలిమసరతరించి పూ
చెండులఁ బోలు నెన్నుదులఁ జేసిరి పెన్నిటినాడి పాడిపై
న్గొండలవంటి బన్నములు గొట్టి తుదం జెడకుండు నింటిలోఁ
బండుటఁ జెందు కల్మి నసి పండుట మొంతనవచ్చు నేరికిన్. 79

క. నేమమ్ములఁ గతివేలుపు
సామిన్ మెచ్చించియుటని * దగొను నెనరన్

దామరకొలనున నీదం
గా మరులొందించిమదినిఁ గడతేర్పవలెన్. 80

ఉ. పొర్దులుపుచ్చనేల తల పుల్ పలుపోకలఁబోవనీకయీ
పెద్దలత్రోవఁబట్టి యెల మింగడఁజేరుటఁగోరి నెమ్మదిన్
నిద్దపుటద్దముంబగిది నిల్చి కనంగనఁబోలునట్టియ
వ్విద్దియ మాదులోనికను విందొనరింపుమునింపుమింపులన్. 81

క. అనుచుజడవారియంచలు
వినిపించిన పుడమితేఁడు వీనులవిందా
విను తెరవరిబోనముతో
నెనయగుముచ్చటలనిచ్చె నెదసంబరమున్. 82

క. అబ్బాసవాలుసాములు
నిబ్బరమగు తెలివిగొలిపి నెటిదీవనచే
నుబ్బించినెలవుఁగొనిపొం
గుబ్బలికై చనిరియతని గొనములమరులై. 83

ఉ. తొల్లిటిపున్నముల్ తనకుఁ దోడ్పడుటన్ గతివేల్పునంజలం
దుల్లముపట్టుగొల్పి తన యొప్పిక సందడిసేయనేలుచో
జెల్లనుసాటఁబంచి సిరి యేలికబత్తిఁబొసంగఁజేసి జొ
త్తిల్లెడుడెందఁపున్నిలుపు తెల్లరకబ్బురమందఁజేయఁగన్. 84

సీ. కట్టించెనూరూరఁ గతివేల్పుకోవెలల్
ధట్టించెనోర్వని కట్టడులమ
పెట్టించెనోరంబు పేర్మిఁబాఉలకెల్ల
దట్టించెనెమ్మదిఁ దాల్మియూట
మట్టించెదోసము న్నాటపుట్టఁగనీక
గొట్టించెనానఁగైకొన్నవారి
నెట్టించెపెఱవేల్పు బెట్టుదెల్పెడివారి
కెట్టించెఁదొల్లిటి తేండ్లసిరుల

గీ. మట్టుమీఱినబత్తిచే గట్టుదారి
గుట్టుమదిఁగాంచితముల చేఁ గట్టువడక

ఘట్టుసడలంగనీకలోఁ బుట్టునెఱుక
పుట్టువులమట్టుమల్లాడెఁ బుడమితేఁడు. 85

సీ. తఱిగట్టుదార్రిపైఁ దలఁపునిల్పుటగాని
తలఁగియొండొకతావు దప్పిచనఁడు
సోకుమూఁకలగాంగఁ జూచుటింతియుకాని
కలనైననన్నొంపు గలిమిఁగనఁడు
వెన్నదొంగపొగడ్త వినుటింతియేకాని
వీనులఁజొరనీఁడు వేఱుపలుకు
పక్కిడాల్సామిపైఁ జొక్కుటింతియకాని
సొరదిచొక్కములైన సొగయఁబోఁడు

గీ. రేలుఁబవలును బెఱజోలి మాలిజాలిఁ
దూలిరాచూలిసిరినేలు దొరవిరాళి
గ్రానిన తెఱఁగునమఱుగు నెమ్మదివసంబు
గాకపిఱుతీకయిచ్చని క్రూరశిఁదనరి. 86

క. ఎన్నియొ వెన్నునినేమము
లన్నియుఁగడమఁబడనీక యరసియరసితా
ఘన్నియొనర్చినునెల్లా
రెన్నఁగనయ్యేడయఁడొచ్చె మెఱుగనిబత్తిన్. 87

శా. ఆతేఁడేలెడునంతపట్టుగలయ ల్లారుణ్ సిరుల్ రెచ్చనా
రేతే చెల్లెలికాలుమెట్టినదొరన్ రేలుంబవల్ గొల్చుచున్
దారుం గొమ్మలు బిడ్డలుం గొడుకులుం దాదాపువారున్ గొఱల్
దీఱన్ జెందిరియెన్నడుంజెడని కల్మిం బల్మి నబ్బమ్ముగన్. 88

క. సిరిమగనినేమములలో
సరిఁజూపఁగరానిదనుచు సాదులువొగడన్
దొరయేకాసికివలఁబడె
దొరయంగలవారెమెట్టి తొల్లిటిదొరలున్. 89

సీ. ఏనుఁగుల్ తత్తడు లెకిరింత లెద్దులు
క్రేపు లావులు మొదల్ కెరలియైన

గసవుమేయమిఁగాదు కలనైనముట్టవు
పిన్న పెద్దలునోరె మన్నవిసరు
కరివేల్పుజాతరల్ కడునగ్గలములయ్యెఁ
బగలురేల్ పస్తు సొప్పడియెఁబజకు
నింటింటదొరయాన లేకాకతినయంత
నిచ్చెఁబున్నెఁపుఁజెయ్వు లెసకమెసఁగఁ
గీ. దానుదనవారుఁ బొద్దునఁ దానమాడి
జాములెనిమిది నీర్వట్టు సైతమెడలి
పేర్మినేకాసినేమంబు పెద్దసేసి
మెలఁగఁజొచ్చెనురాజాలి మేలుబంతి. 90
క. బాడసిగదెలంబారుల
గూడియొకింతైన కొఱఁత గూడినమదిలో
నూడంబాడినదొసఁగుల
వాడిమితోఁగుడుచుఁదోడి వారలఁగూడన్. 91
ఆ. ఇట్టిగట్టిబిరుదు టేలికడెందంబు
మేనుగొనియెనన్గ మెఱపుదనరి
వాలుగంటి మరుని వాలుగంటిమటంచు
నెంచఁదగినచెలువ మెలమిమిగుల. 92
సీ. గుడియూడ్చి యలికి ముగ్గులువెట్టి సాంబ్రాణి
పొగయించి చేమంతి పూలసరులు
వాకిళ్ళసందుల వలయుచోటులఁగూర్చి
తఱిగట్టువారికి దండమిడుచు
గందంబు పన్నీరు కలపమ్ములందుచుఁ
బూలుపైఁజల్లి నివ్వాళులొసఁగి
కాయలు గూరలు కమ్మనినేతితోఁ
జక్కెరయునుఁ బాలు చాయపప్పు
గీ. సన్నబియ్యఁపుటోరెంబు చక్కనొసఁగి
తమ్మలంబిడి వలగొని తప్పనీక

రాణివాసంబునిచ్చలు రాకపోక
లెడలుత్రోవమరంగితా నదగఱింగి. 93

గీ. అట్లురాణివాస మలంతిసేతలెఱింగి
శిల్లమెడలందనదు నిచ్చమెలంగ
నిరువురంచజక్కి నేలికయ్యాకులెంక
పొంకమడలనీక పోషిదిసేయు. 94

## లయగ్రాహి.

చుక్కలనుచుక్కుమను జుక్కజిగి నిక్కుసరు
లక్కునను గ్రక్కడల త్రెక్కుతుద మొక్కల్
నిక్కముగజక్కువల మక్కువలయిక్కడ
ద్రొక్కనలజక్కిమము నిక్కినగటుక్కున్
జెక్కుచుందళుక్కురను నొక్కవలువెక్కువగ
బిక్కటిలరక్కసులు నొక్కుదొర చిక్కన్
మ్రొక్కంగం దటుక్కునను నక్కవకు సక్కజము
వెక్కసంపుజొక్కమిడందెక్కంగను బ్రక్కన్. 95

ఉ. కన్నులసంతసంపుజల గాఱంగ సాగిలి మ్రొక్కి మ్రొక్కి యా
క్రొన్ననవిల్తుతండ్రికినిం గోరికలీరికలెత్తంబూన్చి తా
నున్నది వెన్కంజన్న ధియునున్న ధిరకాకసటాడ్చి వేమకల్
లిన్నెలుగట్ట రానెలయు లేమయునివ్వెఱఁగందిచూడఁగన్. 96

ఆ. పక్కజక్కినెక్కు రక్కసిగాంగ యా
తనింగాంచి బాపు రేయలంతి
మూంకలయ్యెయెడయ మొత్తముల్ తంపులన్
బాతిలోన మేలు బాతిపై తే. 97

ఉ. పుట్టువులెన్నియైనం దలం పుల్ననుం జేర్చినవానిపుట్టువే
పుట్టువుగాని చోం బుడమిం బుట్టుట తల్లికిం బాయుమూడ్వంగాం
బుట్టుట తండ్రికింజడని పుట్టువులిచ్చుట కాక వానియు
ప్పుట్టువుపుట్టువే విసము పుట్టుటకాడొకొ వంగడంబునన్. 98

క. మదినడనుడులన్న న్నె
పదిలంబుగఁ బట్టినట్టిఁ బ్రియుకుఁడుమాఁగితి
విధియుపియుసనేటికినా
ముదిసీయదిమొద్దిమైన చదువు మెఱుఁగెదన్. 99

ఉ. నాళిని వేల్పుగిడ్డి వలె నా మొడమాలిమిగ్రమ్మరింతు నే
నావినియొందు వేడుటకు నాయమనీకడగంటిచూపు లే
గావె పెతల్ దలంచికడకంగడకందువనొందఁ జేయు నే
లా విడయాసకూళయుఁద లంచు నెనన్నము వేడఁగానిరున్. 100

క. నాదండముగై కొని సిరి
కై దండంగొనినసామి కలుసము లెడలన్
గాదండనిలువు మన్నము
గాదండ పెతల్ దొలంగఁగాఁ జేయుటకున్. 101

గీ. చిన్ని నవ్వులొలయ సిరిమొగఁడాతని
మోముఁగాంచి చంద మూషమాంచి
పొంగుపాలవెల్లి పోలికఁబొంగియూ
టనినుడుల తియ్యఁదేనెఁదన్ను. 102

క. కుందనపువలపుపొలుపున
డెందము నావలపుదవిలి డిగవున్నది యే
కొందలములుఁ జెందవుని
న్నందున్ నీముందు నడతు నేనెప్పటికిన్. 103

శా. చుట్టుంగైదువు నీకుఁదోడగుచుని ల్చున్ శ్వాసవ్రాల్గుంపుచేఁ
దిట్టుల్ సేరఁగనీక నెప్పగలఱ్ఱ త్రిన్ సోకనీ కల్లెడన్
మట్టుల్ మీఱునె రాసిరుల్ గురియుచున్ మంచుంబలెన్ బన్నమున్
బొట్టై దుల్లఁగఁజేయుచుం బవలు రేల్ ప్రొల్ప్రొందునాయానచే. 104

వ. అనియవ్వేలమురిదాలుపు కడలిమొలనూలివాలుగంటి కే గంటికింపై
సకోడెకానితో ముచ్చటలాడి విచ్చలవిడి యచ్చర మచ్చెకంటితుటు
ముల నాటపాటలంజుట్టుకొను మింటితెరవరిగుంపుల విడువనిపొగడు
నుడువులన్ తమ్మికడుపుదేవరడెందంపు బుట్టువులగుజడలయ్యలతొలి

నుడులఁజెవులం దెరలీక పాల్కడలి చూలిచన్గొండల యొఱగంట్లపై మెఱుఁగులీను నపరంజి రేకపోలికం జెలంగు పొంబట్టు రెట్టెంబునోఱయు తననెమ్మేనిచాయలఁ దొలకరి మొగుళ్ళనందగించు మించుంబలె మెఱయఁ దన్నుఁ దప్పకచూచు రాచరేఁనిచూపులంబోలె నఱుతనరుదగు వేల్పుమ్రాఁకుల పూదండల పయింబఱచు తేటిమూఁల మేలితళతళలతో మెఱయఁ బక్కరాముక్కు నిగనిగలతో ఱెక్కతుదలం బాఱంజూచిన యంజతుదలం బాటిలు గోటితేటలు మింటికిఁ బున్నమనాటి తొగనంటుకాని జంటవెలుంగులీన దబాటునసుంత సంబునంగలయునంతలోన. 105

సీ. పచ్చపాగాజోదు పదివేలమేనుల
తరలివచ్చినయట్టి తళుకులీన
మబ్బులోఁబడవేసి మాలి యొక్కమ్మడి
తోలఁగివచ్చినమించు తుటమనంగ
ముప్వారొక్కటియాచు మొనసిమంటలుగ్రక్క
గాలినెచ్చెలికాని కలయికయన
కడలివెఱ్ఱపాటిపో కడఁబెట్టుతఱిదుంత
యెక్కుడునలుకపే రుకుకలనఁగఁ

గీ. బుడమియెల్లనుదానయై భుగభుగమని
దరికొనుచుఁ దేఱిచూడంగఁ దరముగాని
బెడిదముగఁ గాకలొల్కుచుఁ బుడమిఱేని
యెదురఁబోఁడసూపెజట్టువా లెసకమెసఁగ. 106

క. సిరిదొరవేయంచులసురె
కెఱఁగియొరందొడివినిలిపె నింటన్ వాలున్
గరకరిపగఱం గెడపుచు
మెఱసెంధదొరయింటఁ దనువు మెయికొనిబిరుదై. 107

వ. అని తెలిపిన నవ్వాలి తెఱంగడుగుటయును. 108

## ఆశ్వాసాంతము.

శా. కట్టుంబుట్టము పొట్టకుం గడుపురొక్కం బేమియున్ లేమి లో
నెట్టం దొట్టుచు గట్టుబట్టనికడుం జెట్టయ్యనీపేరనన్
చెట్టుం బెట్టు బలెన్ సరుల్ డొలిపి నెమ్మిన్ సాటిదాటించి నీ
పట్టుం జేరఁగఁబట్టి చిట్టలమునాఁ బంతమ్మునీసామ్మయా. 109

క. గట్టుదొరపట్టిమిట్టలఁ
బెట్టుల్ వడ నెట్టిగట్టి చిత్తరఁపుజనుం
గట్టులకోటఁజిత్తరు
వుట్టిపడన్ వ్రాయుచిలిపి యొఱపులతండ్రిన్. 110

మాలిని.

జడలు నెఱులుగుంపుం జక్కజాబిల్లితున్కన్
పొదిగి కుదుట నేఱుం బోటినిన్ మాటియొంతోఁ
బదిలపఱచిగట్టుం బట్టితో మాటకున్ లో
నొదుగ వెరవు నీకే యొప్పుఁ గప్పర్తివంటా. 111

గద్య.

చ. ఇదియుపరంజిసొమ్ముపయి నింపుగఁగెంపులుచెక్కినట్టులా
ప్పిదముగ మింటితెర్వరుల పెద్దల సిద్దర జెప్పుకబ్బమై
మొదవులపాలతెమ్మలన ముచ్చటలంగల "ముల్గుపాపయా
రదు" లొనరించు సర్వమధు రంబునఁ దొల్తటివిన్నపంబగున్. 112



ఓమ్.

శ్రీ లలితాంబికాయై నమః.

# సర్వమధురము.

## రెండవవిన్నపము.

క. సిరిమలకానలలోనం
దిరుగుచు మన్నిని పోల్కిఁ దెలగంటిదొరల్
కరువిడిగొలువఁగబంట్లకు
సిరిదొలుకంజేయువేల్పు! చిలువలతాల్పా!. 1

గీ. అవధరింపుము జడదారి యంచలకును
నాలుగవ వంగడంపు వి న్నాణియనియె
ని త్తెలుంగున. కడలిసం దెల్లపుడమి
నేలుచున్నాఁడ నాశ్వని కెంపునింప. 2

క. చూతురు తెప్పార్పక సరి
సేతురువలరాజుచెలువ చెలువమునెడలన్
వైతురు రాకొమరులుబళి
కూతురు "శ్రీమతి" యనఁగఁ గొమరుదలిర్పన్. 3

### శ్రీమతివర్ణనము.

సీ. కాలిగోరులటెక్కుఁ గనవుచుక్కలుపిక్క
లపరంజిబూరలౌ ననఁగవచ్చు

తొడలనంటులమించు నడలేనుఁగులనొంచు
పిఱుదుకట్టరుదుపెం పిఖ్ఖుగురియుఁ
గానుమింటికిదంట యానాను పొక్కిలిపొన్న
పూవు పొందగటుత్రోఁ బోలుడాలు
కేలుతీవెలమేలు నేలుఁ జన్నులుగిన్నె
లారుకస్తురిరేక గేరుమోము
గీ. గోముజాబిల్లి చెక్కిళ్ళ కులుకుతళుకు
టద్దములవాలుఁగన్నుల యారెమీను
లిరులుకురులనరాదెవే యేలకన్న
చెలువసోయగమెన్నన న్నలువకగునె. 4
క. అన్నాతిమేనక్కడానీ
కన్నెనెఱాణీగదన్న కన్నెలలోనన్
వన్నెలచేఁజన్నెలచే
మున్నెన్నఁడుఁగన్నవిన్న ముచ్చటగలదే. 5
క. తామరతలమెత్తఁగలే
దాముద్దియ కన్నులకు బ యంపడిమోలే
కామోముచందరుండని
యేమోకాకున్నఁగలుగు నేయీవింతల్. 6
ఉ. అంచలుముద్దునం జెఱుత యాటలనాడుచుఁ గూడరావదే
మంచలజవ్వనింబిలిచి యాగడమాడునటన్న నింక నే
మంచు నడల్ కడుంబలుక నానడచల్లదనంబకాని ఘ
ల్లంచనియంచెముంచుఁగద యబ్బురఁపుంగడలిన్ జగమ్ములన్. 7
సీ. పయ్యెదమాటులోఁ బడియున్నయెడ మంచు
ముట్టిన యపరంజి గట్టుఁదెగడి
మొనచూపి మింటికై మొనయుట మిన్నేటి
పొందామరల మొగ్గ పొందుఁదెగడి
జోడుబాయకనిక్కి పోడిమి నేనుంగు
తలమీది గుబ్బచం దంబుఁదెగడి

గరువంపు నిండు చక్కఁదనమ్ముపొగరున
బంగరుపసఁటుల బలిమిఁ దెగడి
గీ. మెచ్చుతగ్గులు లేక బల్పనసి నునుపు
దేఱి లోవెలి గట్టిమై తెఱపియీని
నిబ్బరఁపు గబ్బితనమున నుబ్బుగుబ్బ
లాడిచనుగట్టు బెట్టుఁబోల్పంగ నద్ది. 8
గీ. మూఁడుజగములు వలపింప మొనయు మరుని
కండచక్కెరవిల్లై యిక్కరణిఁ దనరి
తలఁపు సమకూర్చు నోనాఁగఁ దలిరుబోణి
గమ్మరను కమ్మకెమ్మోవి కావిదీవి. 9
సీ. ఏడుదీవులనేలి మొగసిమిన్నేటి బం
గరుదిబ్బలెక్కిన బిరుదుబిఱుదు
ఈరేడుటెంకుల నేచి గెల్చిన మరు
నల్లరాటెక్కెము న్నారునారు
తెఱగంటి చట్టముల్ దీర్చికట్టిన కొంపు
పలకలతమకూటి జావిమోవి
నెమ్మోము జాబిల్లి నిండుతేటలకోడి
మెనసి యొత్తిలు కట్టుటిరులు కురులు
గీ. తొడలుకపురంపుటనఁటులఁ గడలు కొను
పొగడఁగానౌను లేఁదమ్మి మొగడదోయి
చన్నుగవ యట్టియన్నుల మిన్న నెన్నఁ
దరమె కన్నులఁగన్న నబ్బురముగాదె. 10
క. చూపులు మరునంపలకుం
దాపులు తావలకునుదమ్మి దండుల కెల్లం
గాపులు బొమవింటికినా
దూపులనన్ వచ్చుఁ బొగడ దొరకొననేనిన్. 11
క. జవ్వని జవ్వాడెడు నడు
మవ్వెడవిల్తునకు సాటి యగునఁటనిఁకెఁ దా.

నెవ్వరివలపించపదు తా
నెవ్వరి డెందముల నిలువ దెఱుఁగఁగవలదే. 12

క. తానాకసమయినందునఁ
గాను రొదంబాడమఁజేయుఁ గాకతలంపన్
మూనునెయనఁ జెఱుగంటల
చేసులివుల్ ఘల్లురనుచుఁ జేయుం బెల్లై. 13

సీ. నవ్వువెన్నెలనవ్వు ననవిల్తుతూపులు
చూపులు గ్రపంబు సుడియు నుడియు
చెక్కులుజాళువా మక్కులు నదు రేయి
యిరులమూఁకలబట్టి తరుము తుఱుము
కన్నులుక్రొవ్వాలు గన్నులు ముత్తెముల్
తరగలు మొల్లపల్ దంటసరుల
నేలు కేల్కెమ్మోవి డాలు మంకెన కెన
పొక్కిలి పొన్నపూ వెక్కిరించు

గీ. నెన్నదురు సాము నెలగాఁగ నెన్నదురు మె
ఱుంగు రంగులు మేల్కొను నింగియనుచు
నింతి నింతింతఁ బొగడగా నెంతవార
మన్నలువసేత సరిలేని దంటగాక. 14

క. లిమ్మోయి నేరెటి దిబ్బను
దొమ్మిది తునకలను నిట్టి తొయ్యలి సరియా
కొమ్మలు లేరని రెట్టిగఁ
దొమ్ముదులం దెలుపు ననఁగఁ దోచునుపీనుల్. 15

క. వలపులిడఁ గొనఁగఁ గలయా
పొలతుక ముక్కన్నఁ దగియెఁ బొగడు గనుచు నా
కలయదియె నివ్వఁ గొనఁగాఁ
గలవారికిఁ గడుఁబొగడ్తఁ గాంచుటపుడమిన్.

వ. ఇట్టిదుచక్కదనంపు టింపునింపునింప నించువిలుకాని మరులుస
యున్ బిత్తరంపు జంపుగల పాయుంబుడంబు ఱగమొచ్చుగచ్చులం

బెచ్చు పెరుగ నెక్కొక్కయెడలం గన్నుసోగల తళుకులు బెళుకు
సేసిఁ దొలకరిఁ మెఱుంగుల రంగు దురంగలింప మూఁడుగులందిరుంగు
నెడలఁ గిందిమందికి నచ్చరల మిన్న యనియును నెలమావి తోఁట
లంజెలంగునెడ జాజి మొల్ల మల్లియ తీవియలలో నొక్కండని
యును నబ్బమ్మ సందడించుచు తగుమగనిగోరు డెందంబు చిందర
నెల్లచెయ్వులం దొందరంబెట్టి పెల్లు చెలులంగూడి యాటలపాటలఁ
బ్రొద్దుగడపుచు సరిలేనియొయ్యారంబుల వెయ్యారులగు రాచూలి
చట్టంబులు నవ్వులకుం దావులగుచు దాఁగురుమాతలకుం దగుచుం
దురనిపదుగురుంబలుకఁ జిలుకలన్ గోరువంకల గోయిలల నెమ్మల
నంచలం జక్కవలఁ మఱియు వింతవింత పెంపుసుపక్కిమూఁకలకుం
బాడ్లం జక్కరలం దినిపించుచు నిట్టుమెలంగునెడ. 17

మ. ఉలుపాలిచ్చునెవంబునన్ మెఱుఁగుఁజెయ్వుల్ చూపు చందంబులన్
బలువాలుంబలుకల్ బడింగఱచు వి న్నాణంబుల న్నేలపై
గలరాకొండికకాంద్ర గుంపులయి యి క్కల్కిం గనుంగోనలన్
గలయంజూచు మదింగరంగి కదురా కల్ పోకలుం జూపెసిన్. 18

క. వారున్ వీరననేలా
పేరుంజడదారులయిన బెల్లగిలుచు నా
రా రేజేనింగనఁబలెఁ
దారుంజనుదెంతు రాపె తమిలోనేపన్. 19

మ. తలిదండ్రుల్ గడుఁదాల్మి నిచ్చలును డెం దంబుల్ మరుల్గొల్ప న
ప్పలుగుంత త్తడికాని బత్తిమెయికొ ల్వుల్ సేయఁదానున్ సిరిన్
వలపుల్ గొల్పెడి సామిసేతల కథల్ వక్కాణముం జేయఁగాఁ
జెలి వే వీనులనించి నించి తమిబెం చెన్ వెన్నునిం జేరఁగన్. 20

క. తొల్లిటినోమెట్టిదయో
యుల్లం బత్తమ్మికంటి యొద్దనచిక్కన్
మల్లడిగొని నిచ్చలు నెల
చెల్లెలికిఁ సవతిదనముఁ జెందుదుననుచున్. 21

సీ. దాపరం బనుమాట దానెఱుంగని బోటి
తలిదండ్రులక మది దాపఁజొచ్చె
నొక్కచో నిముసంబు నుండ నైపని కొమ్మ
పలుమాఱు పనిలేమి నిలుపుఁజెందె
ననయంబు చెలులతో నాటపీడనియింతి
యెదురబిల్చిన మాట లివ్వదయ్యె
నేమరుల్ గొనక దా నిచ్చనుండెడు లేమ
యెద్దియో కోరున ట్లెసక మెసఁగె
గీ. కుడుపు తడుపులపై నిచ్చ విడుపుబొడమె
నాట పాటల నిసుమంత చోటుసడలె
వలయుసేఁతలపై రోఁత లెలసెఁ గలసె
డెంద మత్తమ్మికంటితోఁ బొందుగోరి. 22
క. చిలుకల కైనసుఁగఱపదు
పలుకులు రాయంచలాట పట్టులఁగనదీ
చలనిమ్ములచెలితోఁ దోఁ
టల విరులఁ జిదుమఁబోవు టయుమదిమఱచెన్. 23
సీ. పచ్చవిల్తునితండ్రి మచ్చికల్ మదిగోరు
తఱిగట్టుదారిపైఁ దలఁపువిడదు
పక్కడాల్వేల్పుపై బాటచల్లఁగఁబాడు
తమ్మికంటిఁదలంచి సొమ్మసిల్లు
కఱివేల్పునకునింతి గాఁగోరి మరులీను
మరునయ్యఁ దలపోసి మదిమరంగుఁ
గజ్జెనెచ్చెలి నిచ్చ కౌఁగలించఁగ నెంచుఁ
జుట్టువాల్దొరచెట్టఁ బట్టఁగోరు
గీ. పసిడిపుట్టంబు సామిచే పట్టెనేని
బ్రదుకుతుదముట్టెనని యాస పడుచుఁ బడుచు
విడుచు నెల్లాఱఁ గురులైన ముడుచుకొనదు
దొంతరల బారువలవంత తో నెలంత. 24

ఉ. ఆమెలనాగ డెందమవి యన్ వలరాయఁడు చిల్కుతేరిపైఁ
గోయనిమెక్కి యార్చి మెలగోలుదళంబులు గాఁగమూఁకలై
గోయిలదండునాగ జుఱు కుంబుపుగోలలు తియ్యవింటివే
వ్రేయఁగఁ దాళలేక కడు వేదురునొంది సలించెనయ్యెడన్. 25

సీ. గుడికేగి చెలులతో గుడుసుకై దవవాని
నలువుకోరికలూర నిలిచిచూచి
మఱునియాటల నెడల్ మఱచి యొక్కించుక
దెలిసితెప్పార్పక వలపుఁజూపు
నాటించి యంతలో నానక్రేళ్లురుకంగఁ
గడగంటిచూపులఁ గలయఁగాంచి
తమ్మిరేకుల కేలు దవ్వులబూన్చుచునిక్కు
మగుపోకుసంతసంబలమనెమురఁ

గీ. బుడమిపోకంగ్రమొక్కి పైనముగులంముఁ
గన్నులద్ది తలంపెపే ర్కుటుగలోన
నుడివి వాతెర గదల న వ్వడికిఁదేట
పడునో యని జంకునారాచ పడఁతివెఱచి. 26

ఉ. ఇంటికినేగి సిజ్జపయి నేకతముండి తలంచి తమ్మివా
ల్గంటికి నచ్చెగాని పెడ కల్కుల కామరునయ్య పొందుచే
కొంటయటంచు నుస్సురని కొమ్మమకుల్ గొని కమ్మవిల్తుచే
గెంటులకగ్గమై వలపు క్రిక్కిరియన్ బొరలున్ విరాళిచే. 27

ఉ. చిత్తరితమ్మిరేకుపయిఁ జెమ్మెయిన్ విరిదేనె గోటిచే
నొత్తుచు వెన్నునిన్ వలపు టొత్తడివ్రాసి చెలింగనంగనీ
కొత్తిలిచూచుచుండు నొరు లొక్కెడవ్రాలిన యంతఁ బైటలో
నత్తఱిమాటుఁ గౌగిటికి నచ్చె మగండని యుబ్బులోపలన్. 28

గీ. ఇచ్చనిచ్చలుతనమీది మచ్చెకంటి
తలఁపుఁదలపోసి పొదిరించి వెలసెననఁగ
నెల్లగడలను వెన్నుఁడై మెనసిఁజెలికి
వలపుమేరగనంగ నె వ్వరికిఁదరము. 29

సీ. తెలిగంటిగమితేని తెలివగాఁ గనుటనో
కన్నుమూయుట లేదు గడియయైన
సిరిబోటి సవతి వా సితలంచియో కాని
యిసుమంత యెమ్మెపై నిచ్చగొనదు
యెనలేనివేల్పుతో నెనయఁగోరుటనేమొ
జతకత్తియలనెయ్య మతకరించు
నిండియుండెడువాని నెయ్యమాసించుట
నో సాపడుట్లైన నాసపడదు
• వేయునేటికి వలరాయఁ డేయు నంప
చిచ్చు మైసోఁకి మదిలోనఁ జిగురు గొనిన
వలపుసెకవేడిచే వేడి చలువ యనిన
పగిదిచెలివెచ్చ యిసుమంత బయలుపడదు. 30

అక్కల్కి నిక్కవంబుగఁ
దక్కగదా చెలువుఁడనుచుఁ దటకాపడి పే
రక్కననలముఁ వలపులఁ
జొక్కెడి నిదురలను దమ్ము సొలసెడి వెన్నుఁ. 31

తనమీఁది మది కొంత దార్చినవారల
విడువనఁ పంతంబు విడిచెనేమొ
ఏకొలందులకేని నాకొలందినటన్న
పలుకు నిక్కము మాటుపఱచెనేమొ
నీవారమనువారు నావారలనునేమ
మీపట్టునను దాచ నిచ్చయేమొ
తనకుఁగేల్మోడ్చినం తనబన్నములనెల్ల
మడపింతు ననుమాట మఱచెనేమొ
మదియొసంగితి వలచితి వదలనంటి
నడుఁగుఁదమ్ములవ్రాలితి నకట ? నెనరు
గొలిపి నావలవంతలోఁ గలపఁడమ్మొ
సమ్మరాదమ్మ. మతకరి తమ్మికంటి. 32

ఆ. పులుఁగుకత్తెలాని పొంబుట్టుపలదోయి
సెజ్జ సొలయు వాని పజ్జనొంది
సవతువంతుబునుక సవతిలచ్చిఁజెలో
సత్తు జెన్నుఁడొక్క- యనితలంచు. 33
సీ. అత్తమామల ముచ్చ టాయింటిలో లేదు
చుట్టాలకత సెప్పఁ జూపసున్న
వచ్చిరవాఁల్లు వదలుటలేదట
కలవట్టు సవతిదే బలిమియచట
కలవాడుబిడ్డమొక్కఁతుఁ సందియటుండ్రు
గడియకొక్కొకతీరు గలఁడుతాను
వేనోళ్ళఁబిలిచిన వినిపించుకోఁడఁట
డెందమిచ్చినఁగాని పొందుగనఁడు
గీ. ఎందు వెదకిన లేనివాఁ డిట్టివాఁడు
నాతలంపెటు లీడేర్చునో తలంప
నెట్టుల విరాళికడలికి గట్టుసేర్ప
నచ్చిన నెలంత లెవ్వరీ నంటుదీర్ప. 34
గీ. ఎల్ల యుల్లంబు లిల్లు గా నుల్లసిల్లు
నల్లనల్లయ్యకిల్లింట ముల్లమెల్ల
గొల్ల కొల్లఁగ నిచ్చిన నెల్లఁడయ్యెఁ
జెల్లెఁబోఁ తల్లడంబార్చు మొల్లమొట్లు. 35
సీ. ముక్కంటి తలపువ్వు ముద్దులుసైదోడు
వెడవిల్తుఁ డాపెకు గొడుకుఁగుఱ్ఱ
గండుకోయిలగుంపు చందోలుదళములు
చిలుకలు గుఱ్ఱముల్ చలువగాలి
యరదంబు నామని యనుఁగు నెచ్చెలి తమ్మి
కలువలు కోలలుఁ గదుసు తేంట్లు
ననవింటి గొనము గా వున నిన్నియును గూడి
యుడికించఁనని యేల వ్యాహారింప.

ఆ. సవతివంకవారు సవత్తోర్పుదురె నాదు
మంచి వారికేమి మగనిగాఁగఁ
గోరుతనకుఁదలఁపు కొనకెక్కఁజేయఁగా
వలదె వెన్నుఁడెంత వాఁడుకంటె. 36

గీ. కంటఁగనుటయెపీనుల వింటిగాని
తుంటవిలుతుండు తానెంత మాటమారి
యొంటమి దలంచి నన్నంతఁ గంటకించి
దంటములుకులఁ జెండాడె వెంటఁదవిలి. 37

గీ. నేల తెలిగంటి దీవనల్ నిండెనేని
నుదుటఁజెక్కిన నలువవ్రాలొదవెనేనిఁ
బుట్టునెడఁ గాముగమిచూపు పొందికేనిఁ
గోర్కెకడగన కెడరేల గొరలుననుచు. 38

సీ. పొద్దుపొద్దున లేవఁ బోవుచోఁగజివేల్పు
నడుఁగుఁదమ్ములు డెంద మందునిలిపి
నిలువెల్ల నెలకొల్పి తొలఁగనీనిదిటంపుఁ
జూపునాటించి ని ల్పోప లేని
తమిఁజొక్కి సిరికూర్పు దెమలనీని తిరంపు
బలితంపుఁగౌఁగిట నలమి చెక్కుఁ
జొక్కనిడి యొడల్ చెమరింపఁ గల్లగొ
నెఱుఁగని నిక్కంపు టెలమినొంది

గీ. ఎట్టకేలకుఁదెలిసి క న్దెఱచి నిండు
తమక మగ్గలముగఁ దాల్మి దొందరింప
నులసి యొల్లమిచేఁ జెయ్వు లుడిపికొనుచు
కడపునవ్యోడ నవ్వాలు గంటిమిన్న. 39

సీ. ఒకొక్కొక్కయెడ తానె మొనరించి మడిగాఁగ
మడుఁగుగట్టు మెఱుంగు తొడవులూని
కంచెలబిగియించి కట్టుబొట్టు నె
న్నుదుట నెమ్మగఁదమ్మి కుసుమరుమీఁదఁ

దమ్మికంటినివ్రాసి గమ్మని గంబూర
గులుకు గంధముబూసి యలరుదండ
లిడి దివ్వెలెత్తి బవ్వడి దోయిళుల విరుల్
జల్లి తియ్యనిపండ్లఁ జక్కెరలును
గీ. నారగింపఁగఁ జేసి నో రూరఁదమల
మొసఁగి పడకింటిపనులకు నోలమాన
గొలుపు విన్నపమిచ్చి య క్కొమ్మ వేఱ
తలఁపుగొనిన మరుల్ దాఁచె వలపుగులుక. 40
సీ. గడెగడెకొక్కొక్క మడుగుసింగారించుఁ
జలువదీర్పించికం చెలుఁదార్చు
మగతాల రవణముల్ మైనించుగందంబు
పూయుఁ గురుల్ గంపు పొగయఁజేయుఁ
బువ్వుటెత్తులుజుట్టుఁ బుక్కిటనిండారఁ
దమలంబుగొను మీటుఁ దంబురలను
సెజ్జలఁబవళించుఁ జెలులతో రవణించు
నెలమావిదోఁటల నెలమిఁజూపు
గీ. నెప్పుడో చెల్వుఁడౌ తెంచి యేలుననెడి
తలఁపుతోనుండు పెఱవారి తలపుఁలందు
నెల్లిదంబౌండు దలఁపనీ దిట్టివింత
ప్రోడతనమొందుఁగలచెనో పూవుఁబోఁడి. 41
గీ. దీమసంబెట్టిదో కాని తెలియవడెంద
ములకు నందని సామిపై వలపుఁదలఁచె
నాతఁడెత్తొయ్యలినిసిరి నాతిమీఁద
బోటి నిలిపెదనని పూట పూటనలచి. 42
ఉ. అన్నాతిమరులు లోఁ గొన్నది మొదలుగాఁ
గోడండ్ర కత్తగాఁ గూతుఁ గననియు
నచ్చానబత్తిదా మెచ్చిన మొదలుగా
నిగి రాణివాసంబుఁ జేతుననియు

వన్నెలంత తలంపుఁ గన్నది మొదలుగా
నిక తాళిబొట్టునే యింతుననియు
నప్పటి తనకూర్మి యాసింపు మొదలుగా
వలగొందునగ్గి కే ల్పట్టియనియు
గీ. మరులునఁ బెనంగెఁగాని యమ్మరునితండ్రి
వేజెతలపఁడ యద్దంట వింతకొంత
మదిదలంచవసంబె యక్కొడదవయేమి
వాంఛితసేఁతలకేలిన వాఁడెతాను. 43
క. కాగలుగు పెండ్లికూఁతురు
గాఁగలిగిన పెండ్లికొడుకు గారాకూతుం
దాగట్టుదారియును జతె
గాగడపిరి కొన్నియెడలు గడుసరిమరులన్. 44
ఉ. ఆనవలావిరాళి మొల కై చిగురై ననయై తనంతఁబె
ద్రాన్మనయి కొండయై కడలి మట్టునవిల్యక నింగియై నిజం
బై నెఱయంగ డెందమున నంతకు నంతకు నెక్కువై యొరుల్
దానని వేజెఱుంగని పె తన్ జగమెల్లకరోరసింపఁగాన్. 45
ఉ. అత్తఱియంబరీషుఁ డన యంబును గూఁతురు పెండ్లి సేయఁగాఁ
నెత్తినసంబరమ్ములు ప యింబడి సందడిఁగొల్పఁజిల్కరా
తత్తడికాని మేల్సొబగు దట్టిన రాకొమరుం డెవండొ నే
నిత్తునువానికంచు మది నెచ్చిన వేడుకబిచ్చలింపఁగన్. 46
క. ఏఁబదియాఱగునాడుల
లో బలిమియుఁగలిమియుంగ లుంగు నొడయులన్
దాఁ బరికింపఁగఁజొచ్చెను
వేఁబరవసమొప్ప నిందు వేడుకనెలమిన్. 47
సీ. తూరుపునాళ్లేలు దొరలలో సొబగులు
సిరులవీఁకలు చాలఁ జిత్తగించి
వలిగాలికడపోళ్ళ నిలుచు నేలికలలో
నందమ్ము ఛందమ్ము నరసియరసి

పడమరవైపుల పాలెంపుఁబట్టుల
  యొకిమీఁదుల తెలుఁగు లెల్ల వెదకి
విడిముడిదొరపట్టు వీడుల దేఁడుల
  సిద్ధాపుగొనముల న్నియును నెమకి
గీ. నలుగడలకిట్లుదగువారి నళవరించి
కుంచిపరికించి వెనుకముం దెంచిమించి
పొరలువేడుక కడలిలోఁబొరలుకొనుచు
సంబరముమిన్నుముట్ట హెచ్చరికదవిలి. 48
ఉ. ఎట్టివివేల్పువంగడఁపు చేలిక కూఁతురునివ్వఁగోరి రాఁ
గుట్టలఁబిల్వనంపె మదిఁ గోరికలీరికలెత్త నెవ్వనిం
గట్టియలర్చుకన్గొనల కాపునఁగేల్గొనునో యటంచు లో
నెట్టియెఱుంగఁడేమియును వెన్నుని చెయ్వులెఱుంగవచ్చునే. 49
ఆ. తలఁపవచ్చుఁగాని తలచినట్టులుసేఁత
వసమెపుడమినెంత వానికైనఁ
జిన్నికూఁతు పెండ్లి సేతునంచనెగాని
కాఁగలట్టితెఱఁగుఁ గనఁడుతేఁడు. 50
సీ. పుడమి యీనినయట్లు పొలుపొంది వేవేల
  కాలిబాటులతోడ గములుగట్టుఁ
గలసంద్రముల పోటు గలయకరళ్ళనా
  గుట్టాపుఁబొజులా గుబ్బగాఁగ
ఒడలిచూపుల మేటి నోడింపగుమిగట్టు
  గట్టులోయునవేన్గు చట్టమనయ
వేడ్కచూడఁగఁగోరు వేల్పులయందలం
  బులుఁగ నరదముల్ పొలుపుమెఱయఁ
గీ. గదలివచ్చిరి పుడమిన గ్గడలఁనెల్ల
మొదలగాపున్నరాకూన లడలఁజేయు
వెడవిలుతుదెబ్బపోటుల బడలలేక
గొమ్మకొనపంట్లుగోరిన గుజ్జుబట్లు. 51

క. మిన్నేకనెలకలిమిని దన
కన్నన్ ననుఁజుల్కఁజూచెఁ గాయనుచును దా
నెన్నోనెలలన్ బల్మిని
గన్నట్లీపుడమిరాచ కందులఁజెలఁగన్. 52

సీ. ననుఁజూచుపూఁబోఁణి ననదంపుబెడిదంపు
కటకుటంపరపాలు గాకయున్నె
నాసారుకును దమ్మి నాటించునంతలో
నెలఁతనివ్వెఱనొంది సిలువకున్నె
నాకల్మివినెనేని ననబోఁణి యెవ్వతె
యేని నోరూరిన న్నెనయకున్నె
నాపోఁడతనము కొంతైనవిన్న వెలంది
పాయమ్మునాపాలు సేయకున్నె
గీ. యనుచుఁ దమతమ బింకెమ్ము గొనములరసి
నన్నెగై కొనుననుదిటం బెన్నసీని
పొడపుసూపంగ నారాచ బొట్టితెల్ల
బలిసిరి యయోధ్య వాడవా డలనుముసిరి. 53

క. ననుఁగన్న నెలఁత యదుఁగిడి
చనునేయని బీరములను సడలరుతేఁడుల్
ననుఁగన్న నెలఁతయడుఁగిడి
చనునేయఁ యెవ్వరనరు చనపునఁబుడమిన్. 54

సీ. కట్టించె మగతాల గదియంగ గద్దియల్
బలియించెఁ బలితఁబు కలనడములు
నాటించెననఁటిగున్నలు నాల్గుచెసలను
నింపించె గమ్మన గంపుమొగలు
నిలిపించె నల్గడ నిలువుటద్దంబులు
దోపించెనలిపచ్చ తోరణముల
సలికించెఁబన్నీట సంగళ్లుమొదలిగాఁ
బూయించెజాజుచేఁ బోఁటిలినేల

గీ. ముత్తియంపుముగ్గు ముంగిళ్ళనత్తఁజేసి
విరులదండలుచుట్టించె వింతలెసఁగ
రాచకొమరులు వేనవేల్ రాణదనర
గూరుచుండఁగనన్నెల కోడెకాఁడు. 55

క. కుక్కములింటింటను మరు
జక్కులజంత్రములు వలయు సవరణలును బెం
పెక్కఁగనలరించెను నిల
నొక్కంటికి వేలకొలఁది నొత్తడములుగన్. 56

సీ. ద్రచ్చునత్తళిమిన్నుదరియుకరళ్లతోఁ
బోడవుగాఁబొంగెడు కడలియనఁగఁ
దెలిగంటిగుంపుల త్రినసంబరమున జు
ట్టిన గట్టుగొంగనిండినచదురన
సింగంబునెక్కెడు చేడె పెండిలినాటి
గట్టురాయనివీటి గలగలయున
ముజ్జగంబులవారి మొనసిచూపఁగనల్వ
బోరినొక్కఁడుగఁజేయు ప్రోలనంగ

గీ. సూదిమొననాటసందీని సొంపునింపు
గుంపులగుమంది యొత్తిడి క్రొత్తవింత
గంతులేయ నయోధ్యనిం తింతగాని
సంతసమ్ములకునుమంద సమ్మయమ్యె. 57

సీ. ఒకచెంత నేనుంగు లకడంక గజిబిజు
లొకయోర గుఱ్ఱంపు టొప్పిదములు
నొకక్రేవ నరదంపు టొఱపుచొక్కటములు
నొకదారిమెలగోలు టొత్తడములు
నొకయుక్కగాసీల యొప్పుటాటలసొంపు
లొకదండపాటయ చ్చికలవింత
లొకచక్కి యంగళ్ళ యందుకంపులపేర్మి
మొకవంక విద్దెల యురువడింపు

గీ. తెల్లమెడలను పెనుసిరుల్ కొల్లవఱచి
ఝల్లుమన మందిరోద పెల్లు గొల్లుమనఁగ
నిలువునిస్తారమును పీటి చెలువు ఉని
చదరుపోలికఁజెలఁగె నిచ్చలునుబొంది. 58

క. చకచకలై తకతకలై
తుకతుకలై యెల్లమెడలఁ దొడిబఱుసిరుల్గా
లకలకలై వికవికలై
పికపికలై పీడువింత పేర్మిందనరెన్. 59

నారదపర్వతులంబరీషునియొద్ద కేతెంచుట

సీ. కావిదోవతి పింజగదియించి తనగోచి
కట్టుపై బిగియఁగాఁ గట్టినాఁడు
మిన్నేటినీటనిం పిన రెండుమోములు
మంటిబొందియుతోడ మలసినాఁడు
రాణింపనొకదొడ్డ వీణమీటుచు గోట
కట్టిపేరులతోన జట్టినాఁడు
నెమ్మెనివెల్లుపైఁ గ్రమ్మిరెండవనిండు
జాబిల్లియనిపింప సాగినాఁడు

గీ. తాల్మినెయ్యంబు డెందమ్ము దార్చి నేల
నాల్గుచెఱఁగులనోడయలం దరియువాఁడు
నేమములదస్నియునుఁ బేర్మి నెఱపువాఁడు
చివ్వబువ్వలజడదారిఁ జేరవచ్చె. 60

గీ. కొండపేరిటజడదారి గూడియతని
నెయ్యములతియ్యదనములు నిండిబాడి
గండుమీఱంగముచ్చటల్ గడిపికొనుచు
వచ్చె నచ్చెరువెల్లారి కెచ్చఁదపసి. 61

చ. ఇరువురుబాసవాల్దొరలు సిచ్చుజగంబులమెప్పుఁగాంచుచుగా
బరువపుసంబరమ్ములఁబవల్ నడు రేయియనంగరాక యొ

క్కురువుగఁ బోల్చి దివింతగన నెచ్చటినుండియొవచ్చిరిమ్మలర్
దొరయును వారిరాకవిని తోరఁపు వేడుక మిన్నుముట్టఁగన్. 62

చ. ఎదురుగనేగి బత్తితుదకెక్కినగారవమూటలెత్తి న
మ్మదుసలివేల్పుటయ్యలకు మ్రొక్కి పదంపడి యంజలమ్మలర్
వదలకపూన్చి యందలముననొగొని తెచ్చి కడానిగద్దియన్
గదియఁగనుంచి పజ్జనొడి కంబుగఁ దానును గూరుచుండుచున్. 63

ఉ. ఎచ్చటకేగువారలొకొ యిచ్చటకీరలరాకగాంచ మా
ముచ్చటదీర్చుటేకద మిమ్ముంగనునప్పటిగోలె డెందమం
దచ్చఁపుఁదెల్వి పొప్పడిమె నన్నిఁట నేమి కొఱంత గాన రా
దొచ్చెముదక్క పుట్టువుల యొత్తములుత్తలమందె నిత్తఱిన్. 64

క. తొలిపుట్టుఁజేయుపున్నెఁపుఁ
బలుసని పండుటయెకాదె పదఁపఁడీమీామీా
వలుద కడగంటి కొన చూ
పులు మాపయివెల్లువలుగఁబొరలుటవెల్లన్. 65

చ. కనుఁగొనఁగానె యగ్గలము గామదిబుట్టినసంబరంబు ద
ట్టిన కడలింగనంగలుగు శేవదనర్చె నెలర్చె కోరికల్
వినుకులుబండె నిండెసిరి వేడుక లూడికలూడఁబాఱె నా
యనువిఁక వేఁకిఁగలద యారెవెయారులు లెక్కగాంతురే. 66

చ. అనియిటులాడుతేని తనుపాఱెమచూపులఁదేఁజమాది మొ
త్తనినుడులన్ మొగమ్మునగు తాన్పుల్ముగమ్మంగఁ జివ్వయోగిరం
బునఁగడుపార్చునయ్యయనెఁ బున్నెఁపుఁబుట్టువుతేఁడ ? లేఁడునీ
కెనయనరాచమానిసి బళీ ? నినుబట్టియ నేలనిల్చుటల్. 67

చ. సిరులకుటెంకివైతివి స సింబసిపంటలు పాడి యగ్గలం
బిరవుగనీవుగాచుపుడ మిం బగఱన్ వినుజాలుబేదలేఁ
డరసిన లేఁడులేఁడు నుడు లంను సమల్గనరాదుతాల్మిపై
లైరవగుచూపెఱుఁగవుగు యిన్ వినినీవొరున్నంపవెందులన్. 68

సీ. పన్నుబందెలు లేవు పాఱులందెల్లెడఁ
గాపులందఱికొత్తి కావిలేదు

పట్టుబంతమునకు బహుపాటు గనరాదు
దురపుమంతనమెద దూఱనీవు
వరదలకొండెంపు బెడబాటునై పవు
కలనైన మదినొచ్చు పలుకుళక్క
యొరులొక్క మొరునింతి నొరగంటఁగను జెల్ల
వసుగుచోఁబొంగట్టు వైనకాసు
గీ. ఎఱుక తెరువరులైన ని న్నెఱుఁగరాని
యెఱుకగలవెల్లకలిమివే యేలనెయ్యు
రులకుముంగొంగుఁబసిఁడిచు ట్టలకు వేల్పు
టాలమేల్బంతివైతివో యంబరీష! 69
సీ. ఎఱిఁగికావుమటన్న సేతఱినైన నను
విడువవు విను మీఁద విఱిగిపడిన
గొలువులోననరాక కలయేలు నేలలో
నెల్లెడఁగల్లరి కీర్పుచొఱవు
పొగడుదీనులజెర్వ వగఁబడదిసుమంత
యెక్కువవారిపైఁదక్కువనుడి
డెందమయ్యెడఁ గుందు నొందకలో వెలి
నొకనిలుకడఁబాయ కుండుకేవ
గీ. తలఁపువమ్మవు టెఱుఁగవు వలపునిక్క
మందయాకకుమళ్ళుబా టనుటవినము
కలిమికినిసుబ్బు బలిమికి గరువతనము
ననుటసున్నగదన్నయో యంబరీష! 70
సీ. నాల్గుసంద్రంబుల నడుమనాడులనెల్లఁ
జాటించి యేకాసి నాటినేమ
మందఱితోఁగూడ నబ్బురంబొలువ గు
ఱ్ఱములు నేనుఁగు లాలగములు మొదలు
కసవునంటకయుండఁగాచి యమ్మరునాఁడు
పాఱువారలఁదన్ని పలుదెఱఁగుల

పసల బంటులఁదన్ను పొసగించిపవఁపడి
వెన్నునకొసఁగివే వేగమెసవి
గీ. యెల్లయెడలను బెగడొంది యిట్టిసేఁతఁ
జెఱుపఁబూనినజడదారి చిలిపినోర్చి
కిందుమీఁదును జేదమ్మి నందితీవు
సంబరంబిట్టువలవదే యంబరీష.? 71
సీ. ముపురవేల్పులలోన మొదటిసామినిబట్టి
ముంగిటనిడుకొన్న మురువుగలిఁగి
మైదైదులకుమీఁది దైనదెద్దియొదాని
నిజమెల్ల గనునట్టి నేర్పుగల్గి
తానెయొంతయు వేఱె తనకన్న లేదను
నిండుతనం బెద నిలుపుగలిఁగి
యేమియు లేకపై యెఱుకకుమీఱిన
యెఱుకవై వెలుఁగొందు నింపుగలిగి
గీ. తెలిసి తెలియక కలయక కలిసికలుగు
నంతవట్టునునెపముగా నరసినీవ
యగుచునీవును లేకయే మగుటగాక
యలరితివి నిన్నుఁగననౌనయంబరీష.! 72
వ. అనియిత్తెఱంగునఁ బోరటఁపుటోగిరంపుటయ్య పలుకునెడం బుడమి దాల్పుపేరింటి సతాసారి యిట్లనియె. 73
చ. అడుగిడకిచ్చునీవులహాయల్ వలరాయలగేరుసందముల్
బెడిదఁపుఁబోరులన్ బగఱ పీచమడంచెడునీక నెల్లెడన్
గడుదెసలందుసందిడని కప్రఁపుదుమ్ములవమ్ముసేయునె
త్తడియసముం గొనంగ నిను దప్పకనొండడఁగల్గఁజూతుమే. 74
క. కననియెడలేదుపుడమిన్
గనుదొరగములందు నిన్ను గనుగనుదమ్ముల్
గొనుడనుపు దనుపు నీచద
రున నిలుచుపట నిలుచుటెదయె ఱుంగ దెయాకున్. 75

క. రాపుట్టువులకు నీకైన
రాపుట్టువులందు బంగరౌ మలయఁగఁదా
యేపట్టునఁగూ పెట్టిన
రాపడనీ వారులసిరుల రహినింపితిగా. 76

సీ. పుడమిఁజూడఁగవచ్చు పుణుకుమానఁగరాదె
నీయూవిశీవియెం తేనిఁగనిన
వెలుఁగుల యెకిమీని వెక్కిరించు నటంచు
నీవీక పెనుధాక నెఱపరాదె
యల చందమామతోఁ గలపడం బగునంచు
నీయంద మిరవొంద సేయవచ్చు
గొనపునిండారులోఁగనిన యంతన పొంగు
మున్నీటితో సాటి మొనపనగును

గీ. కడిఁదిరామగఱాపోల్కి గాఁగ నెన్న
వలెగదా నిన్ను నెడయమే ల్బంతి బంతి
పాపతేనికినైన నీ పరువుఁ బొగడ
నౌనె తగుదయ్య నీకనీ వంబరీష. 77

వ. మఱియుం గడిందిసేఁతలం బలుమగలరోసినన్ నీసరి మింటివిరివడుపు
బొడకట్టంగదావడువులుం కేలుకొనుటలు జన్నంబులుం జెఱువులున్
బావులు దారులనీరుపోతలం బాఱులకుం బోనంపుటీవులున్ మొద
లుగానఁజేయు పుడమి యొక్కెడ గడమ పడు నెలవుగల దనుట
వినుట కనుటలేదే. మీచేనులు పాలందనియని విద్దెలవారెందైనను
గలరనిన నుడి తడివినంగనంబడదు. తోఁటలుతూరుపుమన్నీని తోఁట
మాటలునుడువనోర్చ వనుటమేలు. కొడుకుల కూఁతురుల మను
మలఁ జుట్టంబుల మొల్లంపువెల్లున నిల్లుతామరతంపరై సొంపునింపఁ
దునుకలయ్యును గానిచొప్పునం బుడమినాల్గుమూలలుం గలయనేలు
చున్న నీకుం బాలవెల్లి వెలదిబ్బ నుబ్బుగుబ్బతిలు గుబ్బలితాల్పు ని
బ్బరంబు జబ్బుపడఁగ నోపునని పొందునుడువుల కొంతపొద్దుముచ్చ
టించిన.

ఉ. ఆయెడనంబరీషుఁడు బయ ల్పడి వెల్లువగట్టుభక్తిసో
రాయపు సాంద్రపూరగ లంబడిమున్గుచు బాసవాల్గవా
దోయపువిందులందనిపి తొట్రిలు తియ్యదనంపుమాటలన్
బాయకఁగొల్చుచున్ నిలుచుపట్టున "శ్రీమతి" వచ్చి మ్రొక్కెనన్. 79

మునీంద్రులు శ్రీమతినిగాంచి మోహించుట.

సీ. చిలుకతేజవరాండ్ర చెల్లాటము మఱంగి
నడయాడు వలరాజు పడఁతి యనఁగ
మెఱుఁగుఁబూఁబోఁడుల మేలంపుటాటల
మ్రోఁగు మజ్జెలచ్చి మొలఁతయనఁగ
జతమింట నాగవాసము గూడి యాడెడు
జడదారి తోడబుట్టు సకియ యనఁగ
సాటిబోటులకు సయ్యాటంబు సవరించు
రారాచఱికఁపు బెన్ లచ్చియనఁగ
గీ. నిరుగడల వేనవేల్ చెలుల్ దరసి యలమ
నీటు లొయ్యారములు కుల్క తేటహొయలు
బయల బరువులు వారంగ బాఱుదెంచు
రాచిఱుతఁజూచి జడదారి రాచదోయి. 80
క. వెనుకయు ముందుం దోచని
ననవిల్తుని దాడిదవిలి నానదొలఁగి తా
రనువెఱఁగని యడరున ఝ
ల్లని గుండెలుసెదరి బెదరి యాకట పడుచున్. 81
సీ. ఐదుచిచ్చులు చుట్టు నలమఁ దాలినవారు
మరుభిక్షాకకు బిట్టు మలచువారు
కొండల తిరుగుళ్ళఁ గొమ్మ చన్గొండలు
గాంచి యొకరుఁడు నైనఁ గదల రైరి
మొదలొకటఁ దిరంపు కుసుట నాటెడు వారు
మాఱుత్రోవలఁ బోవ మలపరైరి

• కట్టినెచ్చెలిపేరు గఱచునోరుల గొమ్మ
మోవి కోరిక ద్రిప్ప మొనయరైరి
గీ. నానదిగదాని లోఁజూపు మాని మీఁదుఁ
జెదుట కోడక తగవుఁ బో విడిచి తమకు
నందికకురాని జోలిపై నాసధవిలి
పడఁతి వలవంతగుమిలి ర జ్జడలవారు. 82
క. పుట్టినది మొదలు వలపుల
పుట్టెఱుఁగని బడుగు జడల పుట్టుల నయయో
కట్టడి మరుఁ జేచుటచే
నిట్టూర్పులకాక నింగి నేలయునుడికె. 83
క. ఒంటిగఁ గొండలచఱులం
దుంటకు నివ్వాలుగంటి త్రోడైనను మా
తొంటియొనర్చిన పున్నెపు
బంటగదాయంచుఁ దలఁపు పాలై రంతట్. 84
సీ. ఒడలఁదమ్ములపూస లుదుట బూడిద పూఁత
జడల జూజురుగాంచి జడిసి జడిసి
కరకకాయలమెక్కి కసరుగడ్డలుగ్రుక్కి
విసుప దాడలసొట్ల వెఱచి వెఱచి
వెన్నంటి డొల్లలై వెనుకకేగ్గినబీద
కడుపు లెండుచుఁ లోనఁ గమిలికమిలి
దొమ్మర్ల గడవాళ్ళ దొరయుపేర్వులజీర
గములఁ దలంచుచుఁ గ్రాగి క్రాగి
గీ. మగువ నునుసోయగమునకు దగని గోడు
బాడమెగాయని డెందంబు లడఁచికొనుచుఁ
జూడకున్నను బ్రతుకక చూచిబ్రతుక
లేక చీకాకుపడి మరుల్ వేచ వారు. 85
క. ఎమ్మెయిసేసిన దెడలునె
తమ్మికడుపుసామికైనఁ దారెంతటివా.

రమ్మోయి తెగి మ్రింగుటకల
దెమ్మెరలం బడలి రపుడు తిరుగుడువడుచున్. 86

సీ. నాల్గు సంద్రంబుల నడిమినాడుల కాపు
రంబు రాగుంపు ల బ్రంబుమీఱ
కలుములు బలుము ల గ్గలముగ దావారు
తీవి తేవల కెల్లఁ దావలములు
ఎవ్వాని కబ్బునో యీయింతిమేల్బంతి
కౌఁగిట దక్కున క్కర్జమింత
చొక్కంబుగాఁ జేయు దిక్కుగల్గుటదోఁచ
దిట్టవిన్నాణికి నిచ్చ డెంద

గీ. మెట్లుగల్గునో యీతేని కింతపున్నె
మెవరు దెల్పుదు రూరక యెట్లుదెలియు
పాఁజదువులందు నాబోటి పజ్జఁజేర్పు
కొంచెమైనను దొడ్డగా నెంచుఁగాదె. 87

గీ. కొంగముక్కులట్ల గోళ్ళను బెంచుచుఁ
గన్నుదోయి గలుపు కతన సొట్ట
చూపు మరపి సొబగు చూపుబుచ్చుచుమోస
పోతి మెట్లునేడు పొసఁగుఁదలఁప. 88

ఉ. ఆకులు గాయలున్ మెసవి యందము కానలపాలుసేసి పే
రీకలుదీయుకోడివలె నిట్టులవీఱిడిఁబోతిమింక నె
ట్లాకడఁజేరువాడ సొబ కారెడిబోయెడు బుట్టుబమ్మరయే
లా కలిగించెనీపదెగ దాయెగదావలవంతవంతయున్. 89

క. ఈతేనివారి నడిగిన
నీతేని తలంపె కాద యేనియునిలువం
గా రాని చలువవెన్నెల
రేతేనికిఁ దాళుటెట్లు రేలంజాలన్. 90

క. బడిపనులు నేయువరవుని
వడువున నాచూపుగొనల వచ్చుమరుండే

యెడనెడరు వెల్లిముంపఁగఁ
బడవలసెగదా విరాళి బాపుటకోపన్. 91

ఉ. ఇంతికినింపు లేదు వల పింపక యమ్మగవారి మీఁద నా
వంతయు నట్టిగోడెఱుఁగ నానవలా నెరజాణపోల్కి-గా
నెంతయుఁ దోఁచుచున్నయది యీనయగారము లీయొయారముల్
వంతునకింక నొక్కమగు వందలపించుచు నె వేడ్క-నించునే. 92

సీ. తెఱగంటి చదరంటు తెరవు చక్కఁగఁబట్టి
వేల్పురాఁగనసైన వెడలనైతి
పుడమివింతలఁజూడఁ బోడము డెందముత్తోడ
నీనాటికరుదెంచు టేలవచ్చె
నాడునాడీయొకి మీఁదుమన్నింప నే
డేల యీయింతిని నిందుఁగంటి
నింతతోనిబ్బరం బెడలి యీవలవంతఁ
దగులుట కేమిక తంబు గలిగె

గీ. నెంతవారలఁ దలకించఁ డించువిల్తుఁ
డంచుఁగోమ్మానకున్నది ముంచుకొన్న
వలపుదమి డెందమిసుమంత నిలుపుగొనదు
మనిచనిన వాసి యయ్యోనే మనఁగఁ గలదు. 93

సీ. సాటిబోటులసన్న సన్నపైసైగలు
నొగిఁగాంచి యేమంచు నగుదురొక్కొ-
రాణివాసఁపుఁ బూవుఁబోణులింతటిమీఁద
నిలుఁజేరగా సంది యింతురొక్కొ-
రాలెవ్వరైన నారాకకుప్పొంగుచోఁ
దొల్లింటివలె మ్రొక్కు నొల్లరొక్కొ-
యిందేమి యందేమి యెల్లవారలలోనఁ
దలయెత్తరాకుండ వలయునొక్కొ-

గీ. ఇన్నియాఁగాక యిక్క-న్నె వన్నెలాడి
మిన్న మన్ననఁ గన్నంత కన్న మేలు

కన్నవిన్నను లేదెన్న వెన్నదిన్న
కన్నె యన్నకు నెనరున్నఁ గలదుబ్రతుకు. 94
గీ. గజికివేరులు గలిజేరు గారపిండి
కరకకాయలు మొదలుగాఁ గఱచినమలి
యొడలుచెడు చెయ్వులెల్లఁ బో నడఁచి గడచి
విడిచిననుఁ బోవదయ్యె నీ వెఱ్ఱియెట్లు. 95
సీ. ఈనాతికెమ్మోవి తేనియల్ గ్రోలక
మరుకాకనీర్వట్టు మానుటెట్లు
యీయింతిబడిపనుల్ సేయక వలరాజు
వేడికి లోఁగాక వెలయుటెట్లు
యీనెలంతుక పైఁట లోన డాగకయున్న
వెడవిల్తుతూపు పో టడఁగుటెట్లు
యీలేమకన్నెసగ నిటురమ్మనకయున్న
విరివిల్తు చెఱకట్టు విడుచుటెట్లు
గీ. ఈకలువకంటి కౌఁగిట నిముడకున్న
వలపుదొరచేతి యీడుపుల్ వదలుటెట్లు
కసవుసరియైన విరివింటి కాని బ్రదుక
దింతయై యంతయై కొండ యంతయయ్యె. 96
గీ. వేల్పుటింతులమలగొంగ చెల్వ నీమ
మెడలసేయంగవచ్చిన నెంద తెనిఁ
జూచితలకుటలేదు నే డూచముట్ట
దిట్టతనమెల్లగడపె ని త్తెఱవుసొబగు. 97
ఆ. పోతుటీఁగకైనఁ బొలయంగరాని యీ
యంతిపురములోని యాగడంపు
వలపు తేఁడెఱుంగ వచ్చుమోసమునాక
పెద్దతనముసంచి పెట్టినారు. 98
సీ. తమకమగ్గలమైన తందర తెగువచేఁ

బై(బడి కౌ(గిట( బట్టుతల(పు
ముచ్చటతీరంగ మోము గెంగేలున
నిమురుచు లాలింప నిగుడుతలపు
వలపులువ్విళులూర వా తెరక్షమునిపంట
నంటిపల్మొఱు ము ద్దాడుతల(పు
జిలిబిలి ముచ్చటల్ గలిపి సయ్యాటల(
జేరికన్గొలుపంగ( జేయుతల(పు

గీ. ఒంటిపాటిల్లుసమకూరు నోపనంటి
వంటిచంటిపహాొయల్ కేల నంటిమింటి
పొడవు సంతసమంది మే ల్బడయుతల(పు
పొడమ( బెక్కుతలంపుల నిడుమ(బడుచు. 99

క. పడుచు(దన మెన్న(డెఱు(గక
పడుచుంగని మరుని యల(తి పాలౌచు తడం
బడుచు జడదారికవ లో(
బడు చుల్కదనంబునకును బట్టై యంతన్. 100

వ. కురంగట మెలంగుచున్న కన్నెకొమరు గన్నులారంజూచుచు సేయు నదిలేక చీకాకుపడుడెందంబులం దందరపాటున రాణివాసంబని యును బిరుదురామగజూచేరువయనియును దమకునడవడికింగాని చెయిదంబనియును గొమ్మనెమ్మది యెమ్మెరనిలిచియున్నదో యని యును వెలిబొంగసీని వలపుచిచ్చు పెఱ(గి లోనెల్లంజుట్టుకొని వెలు వడు మంటకాసలవడువున నిడుదలగు జడలుజీరాడ యొక్కపెట్టం జుట్టుకొని బూడిదసేయ(దలపించు నచ్చిచ్చు తెఱ(గున నొడళ్ళునిండ గావిదోవతులుగప్పి యీకర్జంబు లేత్రోవలన్వాదకినం దమకు నొడబడ దింక మేనిలుపుగాడుపులనూడని బాడె యొనర్తు మన్న యట్లు పెద్దఃట్టూర్పు వెడలించుచు దిగ్గునపీ(టలుడిగ్గనురికిన నొడ యండంజల చేరువ(జాగిలి మొ్రొక్కి చేతులుమొగిచి నిలుచు నెడ నారదుం వతనికేలు గెలంగీలించి యారుకన్నులకుంగాని యొక్క

విన్నపమాలకింపవలయునని యోలంబుసేర్చి యట్లనియె. 101

ఉ. వేలకొలందిజన్మములు వ్రేల్చితిఁ జేసితిఁ బెక్కుపున్నెముల్
చాలగ నేలవేల్పులను సాకితివాఁగిరమిచ్చిన ల్గడన్
దాలిమిగల్గి కట్టిచెలి నర్మిలిఁగాంచితి వేమిసెప్ప మ
మ్మాలముసేయ కొక్కనుడి యానుముపీనుల నిందుమాలిమిన్. 102

గీ. పుట్టుమొద లెన్నఁడిటువంటి బుద్ధులెఱుఁగ
మేమియోకాని నీకూఁతు నెలమిఁగోరి
డెంద మందమ్మునొందె మా యంద పేర్మి
కూర్మినర్పించి కెంగేలఁగూర్పవలయు. 103

ఆ. మమ్మువంటివారి మన్నన నేలకు
నింగికిల్లబాగడు నెఱపుటనియె
కాదెపాత్రబలుకు కట్టిడియనిచాల
జాలిదూలి పలుకు లోలిఁబలుక. 104

క. తెఱగంటితపసి నుడివిని
దొరయబ్బురమంది తెఱవ తోనగవుసిరుల్
దొరసి మొగమందగింపఁగ
వెఱపుంగదురంగఁబలికె వింతమెలర్పన్. 105

ఉ. వింటివెయయ్యవారినుడి వేడుకగూర్చెడు నాదువంగసం
బంటిన దోసముల్ నులియ నాడిరి యింతగుదొడ్డమేలు గ
న్గొంటగలాదె యిచ్చెదమె కూఁతురి నిట్టిదకాదెకోరెకే
వెంట సిరుల్ ఘటిల్లుటని వేమరుసంతసమంది రిర్వురున్. 106

గీ. అంత నొంటరిరాఁదీసి యతనితోడ
కొండపేరింటిజడదారి కూఁతునడుగ
మదినినివ్వెఱపాటు నమ్మలికగూడి
సందడింపంగ సందియం బందివెఱచి. 107

అంబరీషుఁడు స్వకుమారీ స్వయంవృతుఁడగు
వానికే తన కుమారి నిచ్చెదననుట.

ఉ. కానలఁ గోనలం దిరిఁగి కాయలు నాకులుమెక్కి బాహిరం
బైన చెనంటిసేఁతకిటు బాల్పడ రెన్నఁడు నిట్టివారు నా
దైన కడిందిపున్నెమున నయ్యెఁదలంపిటుపట్టి పుట్టువుం
జేసగునైనఁ దెప్పరపు సేఁతపొసంగె నికేమిసేయుదున్. 108

ఆ. రాచపుట్టువులను రాణివాసములందుఁ
బుట్టరాని వింత బుట్టె నొకఁడు
మగని కిరువు రెండు మగువలుగలరింతి
కిరువు రెండుగలరె యిట్టిమగలు. 109

చ. ఒకనికిఁగూఁతునిచ్చి మది నొప్పిదముంగనెనేది దాన వా
రొకనికి నీసుపుట్టిన న యోసిరులెల్లనశించు పాఱునా
స కడిఁది బన్నముంగొలుపు నైచుటయానది కీడుపుట్టువా
నొకొ యరదంపుబాండ్లనడి యొత్తడిత త్తడమయ్యెనెట్లొకో. 110

చ. అనియొకయింతసేపు వెత నందుచు నిక్కముఁగాంచి వారినో
య్యనఁ దగుమన్ననంబిలిచి యయ్యలుమీరలు నిందునందుమా
కొనరిన నేడ్గడల్ తమకు నొప్పమిఁజైదముపుట్టె నోర్చి నా
మనవి యొకింత వీనులను మన్నఁనజేసి వినంగఁగోరెదన్. 111

క. ఇరువురు నొక్క తెఱంగునఁ
దెలవంగోరితిరి తగని తీరొదవెం దా
పరమేల నోర్తు మీకి
ర్వురకిచ్చుట జగముదెగడు రోయకయెపుడున్. 112

సీ. ప్రొద్దువంగడమునఁ బొడమ రాబుడుతల
లోన వేడినయంత లోననదుగు
గదలక యివ్వని కట్టిడినింగికి
విరియనుమాటసీ. వినికిగాదె
మీకోర్కెదీర్చుట మిగులదెందములోని
గడువంగరాని చొక్కంపుఁదలఁపు
గానసెల్లరుమెచ్చఁ గజంబు సమకూడ

నేనొక్కవిన్నపం బిత్తువినుము

గీ. కన్నియకుమెచ్చు నిర్వుర గన్నయంత
గలుగునెవ్వనిమీఁద మా కన్నె నతని
కిచ్చువాఁడ మెలంగక మెచ్చినాడు
కోర్కెదీర్చుటకే మిమ్ముఁ గోరినాఁడ. 113

గీ. వేఱెతలంపక యారడి వెఱచినాడు
మదికిసంతసమొదవ ని మ్మాటకీరు
నొడఁబడంగఁదగుంగాదె యడుగులంటి
వేడితినటన్నఁ దపసులు విన్నఁబోయి. 114

మునీంద్రులమనోవ్యాకులత.

వ. ఒండొరులు తమడెందముల నిట్లని తలపోయఁదొడంగిరెట్లనిన. 115

ఉ. ఎక్కడిగోడువచ్చె నితఁ డేటికి నాజత నేగుదెంచె నే
నెక్కటిరాక తక్కితిని నీతలఁపూడనిబాడియయ్యె నిం
కెక్కడఁజొత్తుఁ గర్జమిపు డెవ్వరు లెన్నఁబొసంగఁ జేయువా
రక్కట యేమిసేయఁదలఁ పయ్యెనొ చొమ్మిడికెట్టులోగదా. 116

సీ. ఇరకటంబునఁదోసి యేలిక చెడెఁగదా
కర్జమ్ము తలపెంత గాసియయ్యె
మమ్మునిర్వుర నొక్క మారుపీటలనుంచి
కన్నియరావించి కన్నతండ్రి
యిర్వురలో నీకు నెవ్వానిపైఁ దమి
గలుగునో పేర్కొ.గ వలయు ననిన
నొక్కనిఁగోరు నాజక్కవచనుల ౦డి
యారసి నను౹జెందు హైనబఱుపు

గీ. పడినచోనుంట నొండైన బ్రదుకుగలదె
యింతకొడబడకిమ్మను దేనిమొఱకుఁ
దనము తనమీఁద నిలుచునేమనఁగవచ్చు

నెమనఁగనౌనె నగుబాటు లింకనిజము. 117

ఉ. నూలిమి జాలిదూలి బతి మాలిననిత్తురె కన్నె నెందుపీ
యేలికసింగ మబ్బురపు బెత్తుదలంచె నికెట్టులొక్కొ పో
యాలికి నాయెడఁ వలపు లగ్గలమాటకు వేఁడుకొందు జే
జేలనటంచు నుమ్మలికఁ జెందుచుఁ గందుచుఁ గుందుచున్ మదిన్. 118

గీ. ఎట్టకేలకు నొడబడి దిట్టతనము
మట్టుమల్లాడివిరియంప కట్టియలను
గుట్టుగెడపఁగ వలరాజురట్టడులకుఁ
బట్టులై లేచి జడదారి పుట్టులపుడు. 119

క. ఎదలందోఁచిన దెద్దియొ
కుదిరికగల నేర్పుకలిమిఁ గూడిన ననదై
యొదవిన సంబరమగ్గలి
కఁదడంబడ నొడయపొద్దు గనిపల్కె రొగిన్. 120

ఉ. ఎల్లియవచ్చువార మెడ యించుక లేదిదినిక్కువంబు నీ
యుల్లము వేడ్కయే వలయు నొప్పితిమిప్పుడు పోయివత్తు మీ
వెల్లపనుల్పొసంగ మది కింపుగ వే సమకట్టగావలెఁ
జల్లగనుండుమంచు దొరచందురుఁగన్గొని మేలుఁబల్కుచున్. 121

నారదపర్వతులుముకుందుని చెంత కేగుట.

క. నింగికయి మొగసియిర్వురు
సంగాతమురోసి విడువఁ జాలక యెడమో
ముంగదుర సోకుమూఁకల
గొంగంగఁగోరి యతని కొలువున కేగెన్. 122

సీ. తెలిగంటితపసుల త్తెలివపై వలవంత
గుమిలివచ్చుట మెఱుంగుట మొగమ్ము
నవ్వుసందడిముగ్గ నాకొంపుజిగి బయల్
గాసిక మెఱుఁగమి గాకనిండు
కొలుపునకు తగు సేవఁ బిలిపింప నెక్కటి

చనఁగోరియును లోన మినికిమినికి
జతగూడి లోలోనఁ జదురున సిరిగూడ
శాణింప బాసవాల్ రాయలెల్లఁ
గీ. దాలినుకులనెచ్చరింపఁ దో దోపులాడు
మంది పెల్లున సందీక మలయు గద్దె
చకచకల మేనినిగనిగల్ సన్నపఱుపఁ
జెఱకువిలుతుని కన్నయ్యఁ జేరిరపుడు. 123

విష్ణుస్తవఘట్టము.

క. కనిదండనిలిచి కన్నులు
దనివోవం జేసి కేలు దమ్ముల జేజే
పెనురాయలయడుఁగులపై
మొనపి జోహారనుచుబత్తి ముసురుకొనంగన్. 124
వ. పొగడంజొచ్చిరిత్తెఱంగున. 125

## దండకము.

జేజేలతేఁడా ! పరాకేల జేజేలఁ జేకొమ్ము వే కొమ్మునం గుమ్మగాఁ జాపపై పాపరా యెమ్మెకాడెక్కు గుఱ్ఱంబులంబట్టు రాకాసిఁబోకార్చి, తారాకటంగ్రుస్సు వేల్పుంగమింగావఁగాఁ బాలవెల్లిం గడుద్రచ్చుచోఁ గవ్వపుంగొండ మున్గంగొనంజాలు తాఁ బేలపై వీఁపునం దాల్చి యచ్చావెడల్ వెన్నచే వారలందన్పి, సంద్రంబు లాఁదొక్కటేఁ వెల్లివెట్టంగ నేలంతయుంజంకలోఁ జుట్టగాఁజుట్టి పెన్దిట్టఁడై పెట్టునీటన్ మునుంగన్ గడుందొడ్డయై వెల్లడాల్పందిపై వాని మాయించి తొల్లింటి చందంబునన్ ముజ్జగంబుంచవే సామి సింగంబునన్ సాముబజ్జెట్టి చందంబుగా నుక్కుగంబంబునం బుట్టి పేఁపోకుతేనిం బడంద్రోచి నీవానిగాఁ బిల్లనింగావవే పెంచవేయొక్క రాకాసిపై కిందుమీదెల్లగన్పిం పరాకుండ నీమేను వేఁబొట్టిపారుండ పైగంద్రుగొడ్డంట ముయ్యేడుమాఱుల్ కసిఁ రాచగుంపెల్ల జక్కాడియన్నల్ల నేన్మద్వులం జేయవే మున్నుమున్నిటి పిన్నిటి కడ్డమ్ముగా

గట్ట గట్టించి వేవెలుఁగురావంగడంబెన్నికం దుల్కఁజుల్కంగ
నాల్గారు మోముల్ గలుంగ బ్రఁపుం జూచి కేనిం బడందోఁచి
యత్తి మ్మునిమ్మాసిరిందాల్చి యేలించవే యన్న ? పీడాకసంబంత
యిల్లాలి కేలూని రేలుంబనల్ నిందుసయ్యాటలఁ నీటువాటించవే
కజ్జ్యో సెయ్యముల్ సల్పి వేఁగెల్ల మాయించి నేలం దిరంబౌనటు
న్నిల్పవే మున్ను మున్పోటిదాదోటుబల్ రక్కసుల్ మింటికిన్ మంటికిఁ
గొంటులైనంత బ్రాఁబల్కుత్రోవల్ జెడంబాత్తముల్ పెక్కువా త్తించి
యయ్యాదువారిం గడందొక్కగాజొన్ని యక్కీడునన్ వారినీర్చేసి
శ్రాబాపయిం జాపుడాల్జూపి యప్పంటి కప్పంటము త్తైదువల సందు
లేకుండు కైలాటకాంద్రల విన జూడలేకుండఁ జక్కాడి వాడింగ
నంజేతు వీసేతలే బ్రాఁతినీబొజ్జలో గాదెయున్నంతయున్ వెజ్జులై
యెల్లవారిన్ మదిన్ మేనిలో నం దెవుల్ మాన్ప నీవే నెరానమ్మికన్
దండగొన్నట్టి మాబోటులన్ వేఱుగాఁ జూచుచున్నంటికిన్ లేదు
నీవారమైనాము మాబాములంబాపి కాపాడవే కల్మియిల్లాలిఁ
జేకొన్న మాకన్నతండ్రీ? నినుంగంటిమో తమ్మికంటీ ? మముంజూ
డు బంగారుమువ్వల్వవేల్పా ? 126

సీ. అంజగవదండమొక్క యిట్లనుచుఁ బొగడు
జడలవారల నెనరొల్కు చనవుఁజిల్కు
పసిఁడిపుట్టంపుసామి వె క్కసపుఁదీపి
దొలుకు పలుకుల ననిమొ కం దొవలనగుచు. 127

ఉ. ఎచ్చటనుండివచ్చితిరి యిచ్చట నిచ్చలు నిల్చువారలే
మిచ్చల నెందుఁబోతిరొకో యెచ్చట నెచ్చట నేమిగంటిరో
ముచ్చటదీఱ మీకనిన ముమ్మరపుఁ మదిమెచ్చువింత మా
కచ్చముగాఁగ దెల్పఁదగు నంచని పల్కిన వెన్నుతోడులన్. 128

శా. సామీ మీకనరానిదెద్ది జగముల్ సాకంగఁ జాల్పడ్డ నీ
కేమేమో యొకదొడ్డవింత వినఁగా నింపుట్టఁజేయంగలా
మేమేమీ జడదొడ్డు చేసియుఁ బగన్ మేలయ్యె నయ్యారె చా

లామహామెప్పుబొసంగునొండువినుఁడె ల్లన్ విన్నవిం పఁగమున్. 129

గీ. కలదయోధ్యయనాఁ బ్రోలు కలిమిపట్టు
వెలయునం దంబరీషుండు వేయునోళ్ళఁ
బొగడు నెగడిన ఱేఁడు నీ పోల్కివాఁడుఁ
పుడమిఁగావంగఁగలఁడెయ బ్బోటిబిరుదు. 130

క. ఆతేనికి రేతేనికి
మాఱగు నెమ్మోము సొబగు మాటలు వలరే
వారువము లెయగు కూతురు
గారాబపుఁ జెయ్యులకును గనిశ్రీమతినా. 131

క. పలుమాటలఁబనిలేదిక
నలుమోముల వేల్పు సేఁత నాణెము మును పెం
దలవడదిక లేదా చెలి
తలనేయనుట్టొప్పు మెప్పు దలకొనినచో. 132

ఉ. అన్నవలా కయింగొనఁగ నాయితమై చనుదెంచె రాగుముల్
కన్నులపండువై పుడమి గన్పడుచున్నది యేను చూచువే
డ్కన్నగుమోములంజని ప డంతిని గాంచితి మేమిచెల్ప నా
యన్నహహాయల్ మొయల్విడుచు నట్టిమెఱుంగుసుమీ
నిజంబుగన్. 133

క. ఏమోదెల్పుటగాదిది
సామీ జడదారులకును జక్కరవిలుచే
బాములుగల వాచెలిగొన
నోములుతొలుమేన నెవఁడు నోచెనొ తెలియన్ 134

వ. అనియివ్వడువున నవ్వడుగులు నాటితెమిగొామలు మిన్నలముతలఁపు నిలుపున మరులుగొలుపు సొలపునుడిసడిం దెలిసియుఁ దెలియని తెఱంగున బంగరు దువ్వలువతా ల్పిట్లనియె. 135

మ. కలవేయబ్రము లిట్టివెందు నగరే కచ్చుల్ బిగంగట్టి యూ
కలముల్ మెక్కుచు నిచ్చడెందములు జిక్కంబట్టి లోఁగాంచున

య్యాల కిల్లాటకలుంగునే పడతిర్యో య్యారంబుమెచ్చవ్యాడిన్
వలవంతల్ సరిడుయీజోడునగదా వారెందు నిల్లాదురే. 136

క. అనిగీటునఁబుచ్చిన త
చ్చనఁగాఁ దామాటుపఱచి సామీా యసహా
మనవిగల దనుచు వెన్నుని
యనువున నోలమునఁజేర్చి యల్లననగుచుక్. 137

క. జగడపుమేతరి పడఁతికి
మగఁడ నగుదు ననుచుఁ దగవు మ ంలితి వలరా
తొగయంపర కోరువ లే
క గడుం దావలమునైతి నయ్యా ? తాతా ?. 138

మ. నగవుంగాఁదలపోసె దేమనమిడం గారాబమిం కెద్ది మొ
ట్లగునో యావల నాపెతండ్రి చెలియా యండెందమందొప్పిదం
బుగ వక్కాణమొనర్చె నైన నొకలిమ్ముందార్చినా డీవెనా
కుఁగ నెట్లో వెరవేర్పరించుమని మ్రొక్కుల్దోడుగా వేడఁగన్. 139

క. చుట్టుంగైదువుజో దది
యెట్టోపలుకుమనఁ దపసి యట్లనియెను నే
నెట్టుండ నాకు జోడగు
గట్టుం బేరింటితపసి గానింగూడన్. 140

ఉ. గద్దియనుంచి యుర్వరను గాదిలికిన్ విరిదండయిచ్చి యా
యొద్దటిలోన నెవ్వరిప యిక్ వలపున్ననుదెల్పు మీాఁద నా
ముద్దియనాతనింగలిపి ముచ్చట దీర్పదలంచి నాదు వా
డొద్దిక పిన్నవాఁడు చెలి యొప్పిద మెట్లగునో పదంపడిన్. 141

క. ఏతెరవుబట్టిపోవుదు
నేతెఱఁగున నోర్చువాఁడ నింటికినెదురన్
గోరితివలె నుండఁజేయు వె
యాతనినని యద్దుపడిరొ నడుఁగఁలదండన్. 142

ఉ. అంతట వెన్నుఁ డెత్తి యొడ లారసి యింతనసేల సీమదిం
సంతసమందఁ జేతుమిక సందియమేటికి వానిగోత్రి గా
వింతును నమ్ముమంచు సర విన్ నెనరుట్టగఁ బల్కి పంపఁ దా
నంతయునుబ్బి తెల్లజడ లయ్యె చనెన్ ధారకల్లుడౌటకున్. 143

గీ. ఒంటినున్నాడుగద తమ్మి కంటియిపుడె
విన్నకుముఁ జేసి కర్జమ్ము గన్నపిదపఁ
బోరుదిండికి దరమె యబ్బోటిఁ గొనఁగ
ననుచు ననిచినఁ దమి వెన్ను నంటఁ జేరి 144

సీ. కొండపేరిఁటి యూరు దిండి కెందమ్మిడా
ల్చిండునం దలదండ దండమిడుచు
కొండమెత్తినవాని యుండగోరిన పిన్న
కొండికవాని న న్నొండుకీడుఁ
జెందునేయుని కేలు రెండు నొక్కెడుగాఁగ
నుండులోనవిరాళి మెండుకొనఁగ
తండ్రిదేవర వీఁడు దుండగీడనక గ
న్పండువైతివి కోర్కి పండఁజేయ

గీ. నెండయును వెన్నెలను దాఁపి గుండులందు
గండులందును బవళించి యొండుబూయు
చెందులకు మాకుదగనిదో క్కండువవితె
లెండు బ్రోవుంగ బంగారు కొండతండ్రి! 145

చ. పుడమిని రాచయింట నొక బోటి కనుంగొను నాటినుండియున్
వెడవిలుతుండు వెంటఁబడి వెన్నున నుస్సి చనంగ నేయు పూ
బెడిదపుగోలలన్ బెగడి బెట్టు దొలంగి విరాళి వెట్టలన్
సుడివడి తాళ్ధ నసంగనుట సున్నయి నాసయు నీగితింగడున్. 146

క. లో వెలి నిండిన సామివి
గావున నీ తెలియునదియుఁ గలదే కావన్

దేవరవని విన్నపమున్
గావించితి నింతమీఁద గాఁగలదేటులో. 147

శా. గోరంజీకటిచోట దొడ్డపనిగా గొడ్డంట జీఱంగ నే
లా ఱేఁడా క్రొత్తెఱుంగుఁబన్నె నది చాలన్ గూర్చెఁ బెన్గద్దియన్
జేరానెమ్మలఁదీర్చి చివ్వకుడుపుం మీఁబంటునానన్నును
గారాపుం జెలికిం గనంబఱచి జో కన్ మెచ్చు లేగోరుటన్. 148

క. కొన్నింట మిన్నసాదుం
గొన్నిగొనంబులను నతనిఁ గొనకొనికనినన్
గన్నాకగుననితోఁచున్
గన్నవి విన్నయవి కొన్నికతలేఁగందున్. 149

సీ. పెద్దయూనది మొదల్పెద్దలకడనుంట
యాకలి దప్పుల కాఁగఁగనుట
యొంటిమై కొండల నుండి ప్రేగొందుట
మొండ వానల కోర్చి యిడుముగనమి
మైదువెట్టల వేడి కాగి మేన్మఱచుట
పాఁబల్కు గమిలోతుఁబాటుగనుట
యూర్పుగాడ్పులలోన నునిచిబిగించుట
తాలేకనడయాడు తలఁపుఁగొనుట
గీ. మీఁకడాసినవాఁడౌట మిగులబలిమి
కలిమియబ్బెటి విరిదండ గట్టఁజూచు
నతనికుత్తుక నెట్టైన నంతమీఁద
లాతినైతిఁగదా మొగ్గలగ్గలందు. 150

క. మదిఁదెగువఁదలఁపముద్దియ
యొదవమి నాలేమ నిక్క మొండేల మఱుం
జేదనాటిన విరికోలలు
కొదువ యునిచి బ్రదుకుసేరవు గొల్పునెయుంకన్. 151

ఉ. కావున నన్నుఁగావ మది గల్గినయేని పడంతి యిర్వురన్
శీవిగనించి యొక్కనిక డించి మగంటిమి మెచ్చి చేకొనం
గా వలపూనునప్పు డల కయ్యెఁపుఁదిండిని గొండముచ్చుగా
నీవొనరించితేనిఁ బను లెల్లనుదీఱుఁ దలంపుమట్లుగన్. 152
క. అనిపల్కు తపసిగని మోమున నగవొదవంగ సోకుమూకలగొంగం
డనియెనిదియొంతసేయుమఁజనుసందియ మేలనీకు సంతస మొదవున్. 153
వ. అనియిత్తెఱంగున దపసిదోయితలంపులోనఁగూర్చి వారి తెలియమికి
నబ్బురంబందుచుఁ గడానివలువదాలుపు సెలవొసంగి యంపించెనని
చెప్పుటయు నవ్వలికత తెఱంగెట్టులని యడుగుటయు. 154

ఆశ్వాసాంతము.

శా. కేలన్ముమ్మొనవాలు మేనఁ జిలువల్కెంపారు బారుం జడ
ల్లాలం పెంజరగండపెండెరము ము క్కన్నుల్ మొలన్ గారుబల్
డోలుం జంకనుజింకపిల్ల తలనేఱున్ వెల్లయూరేని బా
బాలేఁజాదురువంకయాదలయును ష్బన్ వెల్గుపిన్వేలుపా! 155
ఆ. దుంతరాతుఁగెల్చి తుంటవిల్తునిగాల్చి
మిత్తినెత్తిమొత్తి స్రత్తినత్తి
కొండపిండిసేయు కొడుకుఁగుర్రనుగన్న
యేటిదాల్ప! కొండవీటివేల్ప! 156

భుజంగప్రయాతము.

కడానీమలన్ విల్లు గాఁబట్టిబట్టల్
కడల్గాఁగఁ గార్చిచ్చు కన్నేయునీకుం
గడుం బున్నెముల్ చాల గాలేనిమమ్ముం
గడందోయియుంటొంతయ్య కన్పట్టుదాల్పా. 157
చ. ఇదియపరంజిసొమ్ముపయి నింపుగఁగెంపులు జెక్కినట్టు లొ
ప్పిదముగ మింటితెర్వరులఁ బెద్దల నిద్దరఁ జెప్పుకబ్బమై
మొదవుల పాలతెమ్మలన ముచ్చటలంగల ముల్గుపాపయా
రదు లొనరించు సర్వమధురంబున రెండవవిన్నుపంబగున్. 158

ఓమ్.

శ్రీ మద్ధనుమతే నమః.

# సర్వమధురము.

## మూడవవిన్నపము.



క. సిరిమగనికిఁ గందామర
విరికిన్ సుడివాలొసంగి వేల్పులకెల్లన్
దొరవై యెల్లెడ వెదకిన
దొరజెప్పఁగరాని మొగులుత్రోవసిగయ్యా! 1

గీ. చిత్తగింపుము బాసవాల్ సింగములకు
నాల్గవకొలంపుఁగతల విన్నాణియనియె
వేల్పుఁదపసులు పుడమికా. త్వేరమునను
వలపుదలకొన వేవేగ వచ్చునెడల. 2

చ. తపసికిఁ గూఁతునిత్తునని తప్పనిమాటలవాఁడుగాన వ
చ్చఁపుమది నెల్లఱేఁడులకు సాటఁగబంచిన వారుసాములై
నెపమునఁగొండఱేగి రత నింగడు దొడ్డగఁ గొండతెంచి ని
క్కఁపుదమిఁ బెండిలింగనఁగఁ గ్రందుగనిల్చిరి పీటనయ్యెడన్. 3

ఉ. ఆనుడులాలకించి చెలి యక్కట వేమెలమావి త్రోటలోఁ
దేనియకాల్వవెంట మిడిదేరిన క్రపపనంటపొల్లపెం

ఉ. లచ్చికిఁదోడబుట్టువు చ లమ్మున నన్నిటు వేచెనంచు నే
నొచ్చెముఁజూపి చందురుని యోర్వమి పాలుగ నేతునే తమిం
బచ్చవిల్తుతండ్రికయి పట్టిన పున్నమ పొద్దునుండి నే
నచ్చపుఁబత్తి నల్పనికొ యాతనికిం బొరపుట్ట నేతునే. 11

ఉ. పేదతలంపులట్లు మది బెట్టిన నాదుతలంపులెల్ల వ
మ్మై దఱిఁబట్టకుండునొకొ మాటలికేటికి నెట్టులైనఁ దా
సాదులపాలిపెద్ద గని సామియనా పలుకేల చెల్లు నీ
పైదలిపైఁ దలిర్చు తమి పట్టుగ నిల్పక యేల మానెడిన్. 12

ఉ. గోనెల గాదెలం గొలుచు గూర్చి చికెట్టుల పెట్టెలందు రో
నూనుచు సిర్వారుం జెలువు నోలముఁబట్టఁగఁ జేసి రయ్యయో
యేను నెలంతనైనఁ దన కెల్లది కొల్లలెసంగనీక పే
రానగుదిర్చి కాపురఁపుటందిక కేలికి నందఁ జేయనే. 13

చ. సిలువులఁ బెట్టఁగాఁ దలఁపుఁ జేరిచి లేఁజిగురాకు బాకుపూ
టలుఁగులు తేటిమూఁక లెల యంచులు కోయిల రీఁగు తన్నియున్
వెలితియొకింత లేక వెడ విల్తుఁడు గూర్చి గలంపఁ జొచ్చె నా
తలఁపొనగూడుచోఁ దనకుఁ దల్లినిగాన తలంచఁడేలకో. 14

చ. చెలుల నెఱుంగనీక మదిఁ జేర్చియొ యావలవంత సన్ననై
గలఁ దలిదండ్రులుం గవరు గానక డొంగనదంట యేల యు
వ్వలమురిదాల్పెఱుంగఁ డన వచ్చు నెయ్యల దిగాంచువారు నా
తలసిన యేని రాఁడె వలవంతకు మేరకలుంగు బిట్లొకో. 15

సఖులసంభాషణములు.

చ. అసితల పోఁతలం బాగులు నయ్యెడ నచ్చెలులింత మేడలో
గనుగొన కింత నంతఁ జెలు కంబలికిం చెడుచోట నంచకుం
జనవున నాట నేర్చు నెడఁ జయ్యన రోసియుఁ గాన కచ్చటన్
ముతునడయాడు మెచ్చపుట మొల్లమితో నెలమావితోటకున్. 16

క. వెల్లువనే తెంచి చెలుల్
మల్లియలం బోతిగనిన మాపులకేవన్

మొల్లలనల్లినపాదలం
దెల్లనునారయుచుఁ దెలుపఁదెరవుల్గనుచున్. 17

వ. వారలు తమలోఁ దామిట్లనుకొనిరి. 18

ఉ. ఎన్నఁడునొంటిమైఁ బడఁతి యిట్టుల దాఁ బఱతేఱ దేమొకో
విన్నఁదనంబుపుట్టెనొకొ విన్నటగోలెను పాటువారిపా
లన్నునఁదండ్రిద్రోయునని లజ్జపయింబడి చుట్టఁబోలుఁగా
కున్నఁ గడింది చైదములఁ గూల్కొనునే యిఁక వేయునేటికిన్. 19

ఉ. వింతగదమ్మ తండ్రియిటు వెట్టిమదిందలపోసి యిమ్మనా
నంతటిలోన నట్టిజడ లాతనికిచ్చుట యోర్చరాదు స్త్రీ
యింతియటమ్మ మించుకన డెంచు నొయారిగదా బలారెయెం
తెంతలు లేవు రాకొమరు లీపుడమింగనఁదప్పఁజూచెఁగా. 20

ఉ. రానననేమినల్వమది రాఁగలిగించినచేతయిట్లుపై
రాననఁబోణివ్రాఁతయిటు రాకతమేమికఁ బెక్కులాడఁగా
రాననుఁ బెంచియామనువు రాజటు సేయుటకాన వెన్నెకా
గానఁగనుంగొనన్ వలసెఁ గా మనకేటికిఁ గంటిపుట్టువుల్. 21

మ. సరిరాచట్టమురోయఁ బుట్టఁపుగముల్స న్నన్నగం దల్లి దా
సరిగన్నందుకు జంగమెత్తుకొని దాఁ జన్నందుకున్ సాటి యా
వెరవంచున్మదినొవ్వ నిట్టిసడిగా వించెంబున్రంబోడి ము
న్నురహిం జేసిన నోముబల్మియెటులో నో కాదో నా కేటికిన్. 22

క. అని గుజగుజలాడుచుఁ జెలు
లెనసియిదేమమ్మ ? యొంటి నిచ్చుటఁ జేరం
బనియేమి ఱేఁడువిన్నం
తన మాపయివచ్చుఁగాదె తలఁపిటులేలా. 23

మ. గడెమైన స్నము పీడఁజాల విదియే కర్జంబుగాఁదోఁచి యా
యడవిం దోడుఁదలంప కోర్తునయమో యారాటపుం జేతకై
వడిసేయందగదమ్మ మాచెలుముల స్వామ్మొచసంజాతురే
పడఁతీ ! పెండిలిడాసె సంబరముఁ జె ప్పన్వచ్చినామిమ్ములన్. 24

గీ. బొమ్మదేవరతో నుద్ది పొసఁగునంత
తపసికీఁజొప్పడియెఁ దండ్రి తడవులేమ
ఎన్నినోములునోచితో యిట్టిదేవ
రంతవారలఁజేపట్టు దట్లువలదె. 25
క. నానుడివిని వినమియకా
యానుడుఁగాలించి డెంద మందుఁ జిలువరా
పానుపుదొరపైతనమది
నూనుట వెలిఁగామిఁ దెలివి యూల్కొనియంతన్. 26
ఉ. కన్నులకింపునింపు నొక గద్దటిరాజిలుకం దటాలునం
గన్నమొద ల్తలంపువిడఁ గానకయే యడియాసదానిబ
ట్ట న్నలిరేగి గొజ్జగుల ఢాకల పోఁకల వెంటనంటి పో
వ న్ననుదప్పరించి యెటు దాఁటెనొ చేపడదేమిసేయుదున్. 27
గీ. అలసి చెమ్మటలూరి మేనల్లనల్ల
సొగయనీచల్వచెంగల్వ సొలపు వలపుఁ
దెమ్మెరలదోఁగుచును లోని యుమ్మలికలఁ
బాయకిట్లున్నదానన ప్పలుకుఁబలికె. 28

శ్రీమతివిష్ణునిగూర్చిచింతించుట.

ఉ. దిగ్గునలేచి నెచ్చెలులు తియ్యనిమాటలఁదేల్చుచున్నడ
జ్జగ్గులువెల్లగారునెక సక్కెములాడఁగ మేడలోనికిం
వెగ్గలమావిరాళి నెక వేసటగామరుబెట్టునెజ్జమే
నొగ్గి తలంపు కట్టిచెలి యొద్దనపాయకనిల్పెదిట్టయై. 29
గీ. ఏనుతలపొందుఁదలఁచిన నీవువేఱ
తలఁపుఁజేర్చితె నీకెద్ది తెలియరాని
దింకవెఱపేల నొక్కండు జంకుఁగొనిన
తీరునేయనితెగువమైఁ దెలివిగొలిపి. 30
సీ. తగుదమ్మికంటికీ తలఁపునమ్మినవారిఁ
జెడఁజూచుటయుకాదె విడనిగోవము

తనపల్కులందయా తగవుకత్తికిఁ దెల్పె
వినమెయే పెద్దలు వినని వారు
నీటిలో మునిఁగిన నేలలో దూఱిన
నడవులఁ బడ్డ మి న్నలముకొనిన
కనలగ్గలం బైనఁ గడలిలో దూఱిన
వెలవెలబాఱిన వేఱుత్రోవ!

గీ. బట్టికను౯ దేజీపై నెక్కి పరువులిడిన
విడుతునేయింక మూరుపుల్విడుతుగాక
తనదుసొమ్మగనొడలిట్లు దాచిదాచి
యొరులకొసఁగెడి వెట్టినా కొదవుటిట్లు.

క. ఎఱుఁగుదు నిన్నిప్పంటికి
మఱతు న్వేతలవాలుఁ ళక్కి మాటలనెంతో
మఱుఁగించికూడముట్టిన
నరమకబలుబొమ్మసారె వైతివిగాదే. 84

చ. ఇదివఱకేమియయ్యె నిక నింతట నేమియుఁ జేయకుండువో
కదయనుకొంకుమీఁదఁ గొఱ గాదిదె డెందము దెల్పు దానన
న్నదగదియించి నేలుకొన వేనియుఁ బుట్టువు లెన్ని యేని ని
త్తైదఁ నుదకీవె చేర్చడగఁ దీర్చెద నోర్చెద మీఁదియాసలన్. 85

. మగనియెడ మాటగెలువని
మగువల్ బతుకెంత వైసి మూలినదో క్కో
మగువయొకసత్తెసికుం
దగుచెట్టునఁ గట్టివేసి తగుపనిఁ జేసెన్. 8

సీ. సరివారునగుదుర న్వాఱపుమున్నె లేదు
సాటిఁజూచిననీకు సాటిగలదె
చుట్టముల్వినిరేని జుల్కసేతురటంచు
నున్నదే చుట్టమం చొకఁడుగలఁడె

చెలికాండ్రఁగన్నమ చ్చికఁబోవునందుమే
నీతోడనెయ్యంబు నెఱపనెవఁడు
కూడియాడెడువారు కొఱఁతసేతురటంచు
నందుమే నినుఁగూడి యాడనెవ్వఁ
గీ. డిరుగువారలెవ్వ రెచ్చోటనుండువు
పేరుపెంపుగలదె పెద్దలసిన
మూలనొదిగియుండు వేలబేలనుబట్టి
యాటలాడడెంద మయ్యెనొక్కొ. 35
మ. తగవే నీవనికూర్మిఁజెందిన నెలంతంబట్టిపాలార్చగాఁ
దగదే డగ్గఱిదీసి యాసివలవం తెందోసి చేపట్టినా
నగుబాళ్లను నీకగాకనోరులం దాటెట్లు వేయేలయీ
యగడుంబాపక మానితేని యనురే లామానునిప్పట్టునన్. 36
క. కొమిరెలసేచుటయిదె నీ
కొమరునియెడఁగనుట మాకు గురుతయ్యాను తె
ల్లముగాదె గర్జములు తమ
తమపుట్టినచోటుగొనము తప్పటుగలదే. 37
ఆ. తెలుఁగువారలెవ్వ రేనాడో యేయూరో
తలఁచరాదుమదికి దండతేటు
యుంటిగాకవింతయెల్లవారెఱోసి
మోసపోతినరయదెవుడ్రియాలకు. 38
వ. అనియేలినవానిఁ దెగడునడుపున నిక్కంబుమాటలాడి దిటంబుదెచ్చు
కొని లేచి సెజ్జపయింగూరుచుండి పడిపనుల నెపంబుననుడుగరఁపుఁగ
త్తియులంబోనఁబనిచిగొజ్జంగివిరులదోయిళ్ల దనకునెదురఁగడల్కొను
తఱిగట్టుదారిచి త్తరువునఁ జల్లి డెందంబులోనికి జ్జొనిపి యందుదామర
రేకులపఱుపునం దలపోయుచూపునందీలుపుల నెలగొల్పుటనువుఁజో
ప్పడంజేయందలంచి వేవేలపుట్టువులొందినైనఁబుట్టువాలుఁజాలుగ్గున
కిల్లాలనై చిగురులంబోలు [illegible] యనుసంత
లోన. 39

చ. చెలి యిపుడు పోయె నిటు మేలువాడనయివి చ్చేతు న్నినుంగోరి నా
తలపిట్టుంటయెఱుంగవే కడిఁడివిం తంఁజూపనేఁబన్నితి
స్థలిదంద్రుడుల్గలపించు సేఁతవలన న్గర్జంబుగాభోద ద
ర్వ్యాలనేఁగల్గఁ గొఱంతలేలనుచునార్పు ల్నింగి మోయించినన్. 40

ఆ. కన్నుఁదోగల నగవు గ్రక్కునెమ్మోముచే
సామిదిట మొసంగ సందియంబు
వలవదనుచు బోటి వలయు సేతలతోడి
చెలులఁగూడియాడి మెలఁగుచుండె. 41

ఉ. అంతట వేలుపుందపసు లంచలనెక్కెడువానితండ్రి గో
రంతయుఁ గోర్కె కిం గొఱత యందకయుండఁగఁజేసె నింక నా
పంతముఁజెల్లె నీపడియెఁ బైదలి పైఁ దలిరాకుబాకు వా
డెంతయునన్ననోర్వఁగలఁ డేబ్రకుకొందుసిరుల్ పొసంగనా. 42

గీ. నలువ వ్రాఁతకు సడ్డంబు గలదె యొందు
ముడిసిముప్పననిటువంటి ముగుదనంటు
నంటునాపాలి సొమ్మైన యదియుపాయ
మునను గల్గమికడమయ్యె మొనసెఁగాని. 43

ఉ. నేమము పెల్లునంగదగ నింగను పేదయ యట్ల యేను మా
సామి యెడఁగరంచి కసుఁ జక్కని రాచపడంతిఁ గొంటకీ
డేమియులేక యెల్లపను లిచ్చకువచ్చినయట్ల యైనఁబో
రామిదలంప కిత్తపసి రామల కోపక యందనిచ్చెదన్. 44

ఇచ్చెదనంచుఁ డంబడిమ తెవ్వరు బూచులవంటివారికే
మిచ్చుటయుంచు నడ్డపలు కెత్తినఁదప్పనె తత్తరించఁడే
యిచ్చెదనన్నచో మఱచి యెల్లియటుంటని మించెనత్తఱి
న్గచ్చియవింతలంచు నను కొందురు ఱేఁడులపట్ల నెల్లరున్. 45

ఉ. మంచియెనొట్లు లైనఁ దన మచ్చెఱుఁగండఱొకా రేడు పట్టిసా
పిఱిచేమి నీకునాకుమసి పెల్లగునట్లటు లేలకల్గురా

యంచలమేలుబంతి పలు కాడుట తప్పట లేదెటుంగనే
కొంచపువాడనే దపసి కొండకు నిల్లు తలంపులానుకో. 46

గీ. కలఁదు నాపాలిదయ్యంబు గట్టుదారి
యనుచువేడ్క నయోధ్య నంతంతఁజేరి
వీటుసంబరముగఁ గొంత నాటుతమిని
నారయుచుఁ బెండ్లియొడికంబు లగుటఁబొంగి. 47

వ. వచ్చుచున్నయెడ. 48

ఉ. రావరువ్రుళ్లచేత మదు రాకపుడాయెకిమీని కేర్పడ
న్నావినిపింప సంతసముఁ గన్పడఁ దానెదురేగి వారలం
జేవఁదలిర్చు బత్తిమెయిఁ జేగవయాదలఁజేర్చి మ్రొక్కి మ
త్తావెలిగారులందిడి జ తల్గొనుబూరలుబూరటిల్లగన్.

ఉ. అచ్చర గుంపులం దెగడు నాటల పాటల నాగవాసముల్
హెచ్చరికమ్ముఁ జూపఁగఁ బ యింబడి చూపఱ మూక లొత్తఁలో
నచ్చెరుపాటు తోరపు టో యారులు మేడలనెక్కి చూడఁగా
నొచ్చెములేని బత్తిమెయి నెయ్యన దోడుకవచ్చి యిర్వురన్. 50

గీ. ఏనుఁగులడించి తపసుల నిరుగడలను
నింతులు నివాళులిడ నంత నంతిపురికి
దోడుకొనివచ్చి యపరంజి గూనుగట్ట
మేలు రాచెక్కడపు గద్దె మీఁదనునిచి. 51

మ. మగటాలం బలు కెంపుమొత్తముల డంబౌ పచ్చటాగుంపున
న్జగజంపౌరవణంపు సొంపు సొగసె చ్చన్నెనులందీర్చి గొ
జ్జఁగినీటం గలపంబలంది మిగులన్ సన్నంపుఁ బుట్టంబులొ
ప్పుగఁగట్టించి కుదిర్చెఁ బెండ్లికొడుకుల్పొల్పేలిసింగారముల్. 52

గీ. జడల నూడల మట్టుల సాటిమీటి
మేనితొడవులఁ బొంగట్టు మిసిమినుసిమి
కళుకుబూదుల ముక్కంటి గట్టునెట్టి
చాయనలరిరి తనుపారు జడలవారు. 53

సీ. ఎటుల దాపరమయ్యె నింతికీకాపురం
బెట్టినోములు నోచి తేపడంతి?
బహుగు లెచ్చుటనుండి పట్టుకవచ్చిరో
యింతకట్టడి తేని నెఱుఁగ మెచట
యీతల్లి తానోర్చు కొల్లొకో కన్నులు
తెరువని కూనకీ తెల్లవాడమె
యడవిఁగాసిన వెన్నె లయ్యెనీపె యొయ్యార
మయ్యోకొ నలువ వ్రాయనిదిగలదె
గీ. యనుచు నంతిపురంబు వారంద ఱెదల
ననుకొనని వారు లేరు లే రైరియపుడు
పంటనవలామగండు లోఁ గంటగించు
ననుచు బయలు పడుంగ నీ రైరిగాని. 54
గీ. అలగాపరి కొందలు గా నందఱాదు,
బోసఁగు కెండిలి ముచ్చట ల్కానకిచినుట
కోర్చకుండిరిగాని తీ రొప్పంగను నె
గాఁగలుగు సేత యెవ్వారు గానరైరి. 55

అంతఃపురకాంతలు శ్రీమతినలంకరించుట.

క. రేచందమామయానతిఁ
దోచానలు రాచపట్టిఁ దోడ్కొని కనుటు
లోచిన మగతాగద్దియ
పైచక్కఁగనిల్పి మేల్మి పళ్లెరములతో. 56
శా. మెచ్చుంబాటలతో నివాళులిడి పేర్మిం బచ్చబాలింత్రల
న్నచ్చుంగుప్పరో? నీవు విచ్చులుసిరి న్నల్వొంది నీచెల్వుతో
నిచ్చుంగూడిమటంచు నించి ముదిమెం బెచ్చుగ ముత్తెవు
ల్వెచ్చంగాచిన కిమ్మనూనియ మరుల్ నిండారఁగాఁదన్నుచున్. 57
క. తలయంటి పసపుఁబొల్లు
న్నలుగిడి పన్నీటముంచి నలిసన్నపుఁదు

వడియుఁగ్చి ముసుఁగిడి
ాగబాగిచి చిక్కు వదలించికురుల్. 58
ాల గబ్బి పాలిండ్లగరువంబు
మూలకొ త్తి బిగింపు మొనయఁజేసి
పంపు ముం గొంగు జీరాడంగ
రిగంచుకోక మే నొరయగట్టి
జరి బాబు వలెవాటు సారించి
ందిళ్లకవ బాజు బందులునిచి
దెలు నాను గంటలుమొలనూలు
ర్చుక్క బేసరి చెలువమర్చి
బులబలుసరు లొ్మదలుగాఁగ
క్రులఁదొడిగి తా రుల్లములను
మున నొగులుచు నున్నకన్ని
దమ్యో వెన్నుని మాటకలిమి. 59
తళతళలన్
యములు నిగ్గు భాటునఁ జెలి తా
తనమగనికిఁ
గాల్పిసుకు ననెడు పొలుపుందెలిపెన్. 60
ంగిణీనాఁ
జాజుదీర్చిఁ జక్కఁగ గందం
దండలిడి నె
గొసేసి దండఁ జేతికియిడఁగఁ. 61
బాసి ర్ఘురాల్ల బయలికి నేతెంచి
కనిల్చిన మించు బొదయునంగ
గొడలి మి న్నొరసి తళుక్కను
ంటవిల్కాని కై మువయునంగ

కట్టిపూయుచుఁ దీర్చి పెట్టిపూసినవాటి
మెచ్చిన పండువు లచ్చియనఁగ
పటికంపుబెత్తుఁజే పట్టి నేలగనంగ
నడతెంచు చదువుల పడఁతియనఁగ
గీ. నీటియిఱుబాసి తడియార్చి నిండదిద్ది
తండ్రిచెంగటకేతెంచు తఱి పడంతి
మోముపున్నమ నలచంద మామనోము
గోమునఁజెలంగెఁ బూచిన కొమ్మఁబోలి. 62

ఉ. కన్నులపండువై దుసిలి కాఱుమెఱుంగున జాలువారి తేఁ
జన్నులఁ బైటయోరసిలఁ జందురుకావిరుమాలు కేలదూ
ల న్నడసొంపులంచలకు లాలలుఁబాడఁగఁ బాఱుగెంచి దా
మున్నుగ వేల్పుటయ్యలకు మ్రొక్కి తనంతనఁ దండ్రియొద్దకున్. 63

అంబరీషుఁడు తనకూతురిని నీమునీంద్రు లిరువురలో
నొకరిని వరించుమని చెప్పుట.

క. వచ్చినకూఁతుంగని తేఁ
డచ్చికబుచ్చికలఁదెల్పి యమ్మా నీపెం
పెచ్చెన్ దొసఁగులువిచ్చెన్
మెచ్చెన్నీపాలివేల్పు మేలెట్టిదొకో. 64
సీ. నీగొనంబులలోని నేవళంబెల్లను
నెల్లవారికిఁ దేట తెల్లముగను
తొలుపుట్టువులఁజేయు పలునోముపంటల
కలిమికొంగున మూట గట్టుటకును
మావంగడఁపు రాచ మానిసులొనరించు
పున్నెంపుగుంపులు పోదిగాంచ
తపసులిర్వురలోనఁ దడయకనీడెంద
మేయయ్యపైవ్రాలి మెసకమెసఁగు

గీ. నవ్వులంతికి నిన్నిత్తు ననితలంచి
యున్నవాఁడను నీకోర్కెఁ గన్నపిదప
నీదుచేవిరిదండ యీ నీదుమెచ్చు
తపసి మెడనిల్పి మ్రొక్కుమా తల్లియనిన. 65

సీ. ఇన్నియేడులు పెంచి యీబీదబాపల
పాలవై చెదవె నీపట్టిననదు
నేలనేలెడు రాచ నెలకూనలకు నాకుఁ
దగువారిగూర్చదే తండ్రియనదు
అడవిగాసిన వెన్నె లయ్యెఁగా నామేని
యందంబు తలిదండ్రు లార? యనదు
ఈవ్రాఁత నొసట నీ వేమనివ్రాసితే
హా బమ్మదేవర యనుచు ననదు

గీ. దిట్టదనమేమి సొబగేమి తెల్వియేమి
తాల్మియేమి రవంతైనఁ దగ్గనీదు
డెందమాపక్కిడాల్వేల్పు నంద దవిలి
వదలకుండెడికతన నవ్వాలుఁగంటి. 66

సీ. వలమురిదాల్పు నా వలనఁ గాపరియయ్యె
ననుఁ గోరికొనునంచు నారదుండు
బంగారుతగటు దుప్పటిసామి గలుగంగఁ
బంతమీఁగితినంచుఁ బర్వతుండు
పచ్చవిల్తునితండ్రి పట్టుగట్టిగఁగల్గఁ
గోచయేటికటంచు రాచపట్టి
ఏకోరిక వెట్టు లిత్తునట్టులు వేఱ
మోమోట యేలంచు మామమామ

గీ. చూచెదము దోయియందురా చూలివెవని
కత్తిలిరుదండ వేయునో యనుచుననుచుఁ
గూర్మిఁ బ్రేరేచ నెల్లారు గూడియాడఁ

బాగడపువుదండఁ జేఁబూని పూవుఁబోణి. 67

సీ. తనపంపు మదిలోనఁ దగనిదంచును బిడ్డ
 కొంకునోయని తండ్రి కొదువవిడువ
మదికిఁబట్టనిది యీ మనువంచుఁ దండ్రిపై
 నలుగునోయని తల్లి యళుకువిడువ
కూడియాడెడుబోంట్లు కోడిగమ్ములుసేయఁ
 దలవంపులౌనన్న తలఁపువిడువ
తపసిపెండిలిరోసి తాను దానను నన్ను
 నలమునన్ తేఁడుల యాసవిడువ
గీ. నందియలుఘల్లనంగ నొయ్యారమెంచుఁ
దపసిగుండెలుఝల్లనఁ దరసియిచ్చు
నెల్లపాఱుల దీవనల్ ఘల్లురనఁగఁ
గదలెఁజనువ్రేగునను మొగ్గి గద్దెడిగ్గి. 68

ఉ. ఎక్కడినుండిజోడుబడె నీబలుదయ్యమటంచు నొండొరుల్
పుక్కిటిబాటిగాఁ గనలు పొంగులువాఱఁగ వేల్పుటాకుదిం
డ్లక్కునఁ బూవుబెత్తు చెలి యప్పనసేయుట యెప్పుడోకదా
చక్కెరవింటివాని యొక సక్కములాడుట యెప్పుడోకదా. 69

క. జేజేచల్లనిదేవరఁ
జేజేల౯ మేలుబంతి సిరిమగఁడుకలం
డీజతనంబీడేర్పఁడె
యీజడదారికి నటంచు నిర్వేరుఁదలఁప౯. 70

గీ. రాచిలుకకత్తలానిపై రహిచెలంగు
మరుగొలుపు లచ్చిపోలిక మగువనగుమొ
గమ్ముతో గమ్మరనెడు గం దమ్మువలపు
పుడమిసరియెద్ది లేదను పొలుపుదెలుప. 71

సీ. తలిదండ్రు లిరుగడ నలమికైదండగా
 నేనుఁగుదోయినా నెలమి నడువ

నెచ్చెలుల్ మచ్చికల్ నెఱపుచు సందీక
తెఱగంటి తెఱవల తెఱఁగుఁజూప
నగకుల్కు నకు బెళ్కు జడచిల్కు విరికళ్కు
బెరసిచూపరుల క బ్బురము నెఱప
తొలఁగని డెందంపు నిలుకడ బాసవాల్
సాములగఱచు ము చ్చటలఁదెలుప
గీ. మెల్లమెల్లన రాయంచ లెల్లనడుఁగుఁ
దమ్ములకునాసగొలుపన త్తఱినిగన్న
వేల్పుఁదపసులపై నించువింటివాని
సత్తియోనాఁగఁబఱతెంచెఁ జక్కటికిని. 72
చ. ఎదురుగనేగి చేతివిరి యెత్తుపయింబడి కేలుసాచి నే
నెదగదియింతునో యెఱుఁగ నేటికి నీపనిచక్కఁ జేతున
న్నదిసిరిచెల్మికాఁడు మది నానఁడొ యేమగుదేమి సేతు నె
య్యదికడయెందుఁ జొత్తుమని యారటముల్ తపసుల్ పడంపడన్. 73
క. అరుదెంచిచూపఱిప్పని
యరుదరుదన గలువకంటి యత్తపసులపై
విరిసిన తొవవిరిసోనల
పరుసన దనచికిలిచూపుఁ బఱపుచునంతన్. 74
శ్రీమతి తాపసులఁజూచి భయంపడి పరుగెత్తి తలుపు వేసికొనుట.
ఉ. కెవ్వన కేకవేసి కను క్రేవల ఝల్లువ సోనజాఱ జేఁ
డవ్వయుఁబట్టినన్నిలక హాయనుచుం బరువెత్తి తోడచిల్
చివ్వనవచ్చు నెచ్చెలులఁ జేరకయుండఁగఁదల్పుమూసి య
జ్జవ్వని కౌనుదూలఁ జెడ సందరతందరఁ జేరి యూర్చుచున్. 75
క. వలిగాలిఁ గదలుతీవియ
పొలుపున మేనెల్ల వడఁకఁ బొలతులు బిలువం
బలుకక తలుపుం దెఱవక
సొలపున నటవాటముఁ జెంది సొగయుచుమదిలోన్. 76

శా. ఏమీ తల్లియుఁ దండ్రియుం దెలియరే యింకేరు గన్గొంట లే
దేమో రక్కసిసేతఁబోలె మది కెంతే బీతుపుట్టెన్ సకి
యీమేలంబున కెద్దియో మొదలు మున్నెన్నండు నీవింతగ
న్నామే వింటిమె యొంతయల్లరికి నన్నా తావు నేనైతినే. 77

క. తల్లీ ? యీయారడిబని
కుల్లంబెట్టమ్యె నెట్టు లోర్చితిపుట్టన్
గల్లరిపాల్సేసితెయని
ఝల్లన తనగుండెలవియ జంకుచునంతన్. 78

ఉ. సోరనగండ్లుజూచు నిలు చూరులమర్వులుజూచు పంజరాల్
గీరెడు చిల్క చప్పుడులఁ గెవ్వన నుల్కిపడున్ నిదుర్పు బొం
గార నొడల్ సలింప గలు గల్లను నందెలమ్రోఁతకల్కితో
ల్కాఱుమెఱుంగుఁబైటతుదఁగప్పుచుఁగన్నులుమూయునయ్యెడన్. 79

క. వలుపబెళప్పెళలందెల ఝుళఝుళ మొలనూలిగంట ఝణఝణ కేలం
గలసరిపణీల ఘణఘణయలజడిరాయంచకట్టు లైత్తోఁచెగఁదా. 80.

అంబరీషుఁడుతలుపుఁదీయించికూతురినిభయపడుటకుఁగారణమునడుగుట.

ఉ. అయ్యెడ రాణివాసముల యార్పులకుం దెరపీని కూఁతుపైఁ
దియ్యదనంబు ముంచికొని తెప్పలకున్ వసబోకయున్న క
న్నయ్య ఝుకీనలేచి యక టాయిదియేమొకొ వింతబుట్టె నం
చొయ్యన బిడ్డయున్నయిలు నోలపువాకిటనిల్చి యిట్లనున్. 81

అమ్మా ? కడుపుననుఁగ
న్నమ్మా ? నీమోముఁజూడ నైతినయో[illegible]న్
వమ్మా నాపుట్టువు రా
వమ్మా ? తలుపింకఁదెఱవు మమ్మా ? కొమ్మా. 82

ఉ. ఏటికిబుట్టెఁ దాదరిటు లిందఱము న్నినుఁ జుట్టియుండ ము
న్నీటితొలంకు పైఁబడిన నింగియొఱింగిన గట్టుడొల్లి [illegible]
బూటకదమ్మ నాయొడలు బూటకమై జడదారియందముల్
చీటలువాఱఁ గీడొదవు విన్నదనమ్ములు మానుతల్లిరో. 83

శా. మున్నెప్పుంటికి నిట్టిపాటులునమున్ ముట్టంగఁ గొల్వంగఁ గ
న్గొన్నం బున్నెముగూర్చరాహొ నినుఁగ న్గోరో కనుంగొన్న నా
డెన్నండిత్తెఱఁగేమెఱుంగవు గదా యీకొత్తలేలమ్మ నా
కన్నుల్మిన్గనకేమి చీకుబలె నా గాఁ బిడ్డ నాపుట్టువున్. 84

క. తెలియమిలేదెయ్యెడలన్
గలనైనం జెఱుపునడక గానని నీకీ
నలువురు మెచ్చఁ చైదం
బలవడె నీమదికినింత యలజడిమేలే. 85

చ. తపసులకిచ్చినాఁడ నిను తందరనొందిన దప్పదీనడ
ల్నెపములుగాఁ దలంపొదవె నేనియుఁ దిట్టుదు రట్టులైన సే
మపుఁ బొడవెల్లఁబ్రుంగు గడ మల్బడవింతయు నిన్నుఁబట్టి యే
వపుసడివచ్చు నెల్లరును వందిరి నీతలఁజుట్టి చూడరే. 86

ఆ. అన్నియట్లుండనిమ్ము మా యమ్మనేఁడు
నిన్నుగననేని యూరుపు ల్నెలవుదప్పు
దిటముతోవచ్చి వాకిలిఁ దెఱవుమమ్మ
యంతయడ్డైనఁ దీర్పనా యదియసుమ్ము. 87

ఉ. కొండయుఁబోలెఁ దండ్రిబుస గొట్టుచుఁ జీదుచుఁ గేకవేయఁగా
గొండొకసేపుసైపక స కుల్తనయొద్దనలేమి తానెలో
నిండినబీతిఁ గన్దెఱువ నేరక సైగన యెట్టకేలకున్
జెండనదూకి తల్పుదెసఁ జేరి గదెన్ గడెలోన నూడ్చుటన్. 88

గీ. తలుపుదెఱచుటయును దండ్రి దరసిదండ
దండచేదోయిడైవ్రాలి బెండుబొమ్మ
వడువునను సోలియుంట నె వ్వరికిఁదెలియ
వసముకాదయ్యె నీవింత వలదెకొంత. 89

ఉ. చిక్కులువడ్డముంగురులు చెమ్మటఁదోగుచూడ ల్కడుంగెడ
ల్దొక్కినచుక్కబొట్టు వల రుల్విడిదోరముచిక్కు నెత్తులుం

జిక్కఁగఁ గాటుకంటికఱ జీరలువాఱెడు కంటినీటితో
నక్కననంటి మేన్మెఱచు నట్టి యొయ్యారినిఁ గూఁతుఁగాంచుచున్. 90
క. అడలుచుఁ దలిదండ్రులు లో
జడదారులు మెచ్చుకొనవి సైగయటంచు
న్వెడతలఁపుగదురుటుడుగుచు
వెడవెడఁ గన్నీరులురుల వేగిరపడుచున్. 91
శా. పన్నీరుల్జిలికించి చెక్కులను గ్రంబొత్తి వీచోపులన్
సన్నంపున్వలిదెమ్మెరల్నినిచి చే సన్న న్వెదర్వాపుచు
న్గన్నుందోయి చెఱంగులన్దుడుచుచు న్గారాబుకూఁతుం గటా
నిన్నెంతారడిపెట్టినారముగదే నేడిట్లుమాతల్లిరో. 92
మ. అనుచుం జక్కెరలొల్కుపల్కులను నెయ్యంబాఱ నొయ్యొయ్యన
జ్జనువుంజూపుచు సేదదేఱిచి మము న్గన్గొమ్ము నీకింతగా
బనిలేదీవెతఁబొంద నెందు కయి గుప్పల్గూలి బీతిల్లియుం
తన రాపుట్టులు నెగ్గడిల్లుదురె వింతల్గావె యీచైదముల్. 93

శ్రీమతి తండ్రికిఁ దనభయకారణము నెఱింగించుట.

క. ఎందుకు వెఱచితి వీవెఱఁ
పెందుకునాల్కంటి వింత యేటికినాతో
నిందఱము వినఁగ నుడువుమ
నందెరవయుఁ గన్నులెత్తి నర్మిలిగనుచున్. 94
గీ. ఏమిదెలుపుదుఁదండ్రి న న్నింతయగుడు
పఱచెదవటంచు నెఱుగకే పట్లచాల
మోసమందితి నన్నల్వాఁ జేసినట్టి
యెడరు తానొంద కెవ్వారి కిడఁగవచ్చు. 95
సీ. నేలయేలెడురాచ. నెలలుబొజ్జలనిండఁ
గనరాకో కూఁతుండ్రఁ గన్నమొదలు
నెల్లారు నల్లారు నెత్తిముద్దాడంగఁ
బెంచరో రొమ్ముపైఁ బెట్టుకొనరో

నిలువెల్ల బంగారు నిండసొమ్ములుపెట్టి
కుదువంగఁ గట్టంగఁ గూర్చరొకొ్క
ఈడువచ్చినయంత నిచ్చరాకొమరుల
కెలుచూఱగాఁ బెండ్లి యెలమిగనరొ
గీ. నిన్నుఁబోలెడికట్టడి విన్నఁగన్న
నేడెఱా చెప్పఁటికి లేని వాఁడకాఁడె
రాచపట్టులఁబోలి గా రానసన్నుఁ
బెంచినందుకు మేలు గా న్పించెనయ్య. 96
క. కొమరులఁ గూఁతుల నెల్లరఁ
దమతమకర్మముల వలయు తలఁగూర్తురుపైఁ
గమలిన దెమలిన వారల
యమరిక తీఁడులకులేని దనుటదినిజమే. 97
క. కడుపొడవు విరుగుటకునను
తడువయ్యెఁ గారవంబు వలదనిననునన్
విడువమి నిలువుగ నెత్తుట
పడఁద్రోయుటకయ్యెఁ జాలు పట్టుట్టకవఁగన్. 98
ఉ. తెచ్చెదరాచబిడ్డలను దీరుల సౌరుల వింతవారిగా
మెచ్చెదొ వారి వారి బలి మిం గలిమిన్ మదినాటి సొమ్ముగా
నిచ్చెదనన్ను వానికని యేఁగడునాసగొనంగ నిచ్చలో
రచ్చల వెట్టిసేయుటకు ఁట్టడితంత్రవిద్యమెతి వేమనన్. 99
గీ. చికిలికత్తులు వీనులఁ జెరవినట్లు
మారుపల్కుల గుండియల్ గీరుకొనుచు
నీలగఱచుచు కౌఁగిలి యెడలనీని
కూఁతుతో తీఁడుపల్కె బెల్లుఱుచుకడిమి. 100
ఉ. ఈవెఱపేలఁబుట్టె నను నిట్టుల దూఱఁబనేమి యెన్నఁడున్
నావలనం బొరల్ గలవె నావెలియూరుపు నీవసుమ్ము నీ
నీవఱకున్ మదిం దెలియ నీవికనైనఁ గలంత దెల్పు మెం
తో వెతఁ దెచ్చుకొంటివది తోడుతరెట్టిగ నన్నుఁ బ్రేల్చెడిన్. 101

క. బేలతనమ్మునసన్నీ
జాలింబెట్టెదవె దెల్పు జరిగినకర్జం
బేలాతీర్చెదనని వే
వేలతెఱంగునను బుజ్జ వించినయంతన్. 102

క. అయ్యా ? జడలయ్యల నొక
యయ్యకు విరిదండవేయు మంటివి యదిసి
గ్గయ్యెడు నేలానోశే
ముయ్యగఁబలె కోతికొండ ముచ్చులుసుమ్మా. 103

ఉ. గద్దఱిసేఁత పైదుమికి కళ్యాఁగఁజూచెడు మిట్టగుడ్లులున్
దొడ్డుచెవుల్ చిటుల్బొమలు దొడ్డుమెడ ల్కడుసోగకోరలున్
పెద్దగనంబడంబడుచు బెల్కుఱి యూరుపుదాచుపందనై
తద్దయుఁ దందరం బయలు దారితి బిల్చినబల్కునక్కనన్. 104

క. కలవలపెట్టకతొలఁగుం
డిలుతలుపుబిగించుకొండు నిందుననుచున
వ్వెలఁదిఝరీలుననిలుసార
కలవారలనిలిపి తండ్రిగది యంజనుచున్. 105

ఉ. వేదురుబుట్టినట్టు కను వేదురుగొంటివి యేటిమాటల
మ్మా దొరలిండ్ల నిట్టివెర కగ్గముసేఁతురటమ్మ ? నెమ్మదిఁ
గాదననేల నట్టియెడ గట్టిగ దిట్టదనంబు నూనఁగా
రాదొకొ సింగము ల్పులులు రావె హజారములందువింతలే. 106

ఉ. ఊరడుమా వెఱందలఁగి యొక్కటిదెల్పెద బండ్లసందుచూ
వారలుకోపదారులయి వంచెడువారలుగాఁదలంపు నీ
వారయఁజాలమింబొడమి నట్టిదొసంగిది కంటిదయ్యె మా
కారడిరాకమున్నె పడ యందగువారలమేలిదీవనల్. 107

క. లేలెమ్మితడవుసేయం
బోలకు సిగ్గను నెపంబుఁబుట్టించెద వి
న్లైలనుచు నొడయ వేడిన
యాలోఁదలపొందుగలిగె యతివకునిటులన్. 108

## స్వయం వరవైచిత్ర్యము.

ఉ. ఏలినవాఁడు కట్టిచెలి యేటికి యీ వెఱయించుఁ దొల్లి నా
జాలిదొలంగఁ జేసె నిటు సైగగనంగనతండు సేయు నా
మేలిదినిక్కువంబనుచు మెల్లనఁదండ్రిబుజమ్ము గొప్పనన్
గేలిడిలేచి నెచ్చెలు లొగింగయిసేయ నొడల్ గడల్ కొనన్ 109

చ. జవజవలాడుకౌను చిఱుజంటల గంటల యొడ్డణంబుతో
కవకవలాడు నంచగమి గ్రమ్మఁగ నొయ్యన నందెమ్రోఁతతో
రవరవలాడు నెమ్మొమగ తాల మెఱుంగు మెఱుంగురంగుతోఁ
దొవచెలికాని రేకబలె దొంగలి చూపుల వచ్చెనంతలో. 110

సీ. మామమామయొనర్చు మంతనమ్మనఁగదా
మెలఁతచేపడునట్టి మేలుగనుట
కోఁతియంచనిగదా కొండముచ్చనిగదా
జేలగావున బోటి జేలుపోక
బుజ్జగించగలండు బోటినివ్వఁగలండు
మాటుదప్పనివారి మేటి తోడు
కర్జంబు కడమయొక్కడిది యింకిటమీఁద
నెనగూఁడె నెల్లయు నొక్కసారి

గీ. కలువకంటినిజూడని గడియయొండె
పెక్కువేలేండ్లుగాఁదోచె నిక్కమిందు
గలదువేల్పంచునుండిరి గానితమను
సేయుసేఁతకుఁగాఁగల్గు చేటుగనరు. 111

గీ. పరువుపయి నల్లివాఱిన పగిదినిచటఁ
దనకునీజోడిగోడ్లెల దాపరించె
వేలుపులపెద్ద యీపట్ల వెడగటంచుఁ
దలచుచుండిరియొండొరుల్ తపసులచట. 112

శా. వచ్చెం బచ్చనివింటివానిసిరి శేవంజేర్మి రాశింపఁగా
హెచ్చెపట్టపుటేనుఁగొక్కయన హాయి ముజ్జగంబొప్పఁగా

